సీ. తొలుదొల్త నుదయాద్రి శిలదాఁకి తీండ్రించు
నసిలోహమున వెచ్చనై జనించె;
మఱి కొండవీడెక్కి మార్కొని నలిమైన
యల కసవాపాత్రునంటి రాఁజె,
నటుసాఁగి జమ్మిలోయఁబడి వేగ దహించెఁ
గోనబిట్టేర్చెఁ గొట్టానఁదగిలెఁ,
గనకగిరిస్ఫూర్తిఁ గఱచె, గౌతమిఁ గ్రాఁచె,
నవల నా పొట్నూర రవులుకొనియె;

తే. మాడెములు వ్రేల్చె, నొడ్డాది మసియొనర్చెఁ,
గటకపురిఁ గాల్చె గజరాజు కలఁగి పఱవఁ,
దోఁక చిచ్చన నౌర యుద్ధరతఁ గృష్ణ
రాయబాహుప్రతాపజాగ్రన్మహాగ్ని.

(మను. ౧-౩౭)

నాకుఁ జూడఁగా పై పేర్లలోని కసవు, పొట్టు, కొట్టము మొదలగు పదములు జ్ఞప్తికివచ్చి రాయల కత్తియందు లేని వేఁడి పెద్దనకలమున నావేశించినది. దీని నాధారముగాఁ గొని కొందఱు రాయలు చాల క్రూరుఁడను నపవాదము మోపవచ్చును. కాని అతఁడు జయించిన రాజులలో ననేకులకు తన సామ్రాజ్యమునందే గొప్పగొప్ప సంస్థానాధిపత్యముల నిచ్చియుండుట గమనించితిమేని, పై పెద్దన పద్యమును యథాశ్రుతముగా గ్రహించుట రాయల విషయమునఁ జేయు గొప్పయపచార మనక తీఱదు. (ఆము. ౧-౮౮). సాంగరాజ్యమును స్వాంగరాజ్యమును రెండును సమానముగాఁ జూడవలెనని శాసించినను (ఆము. ౪-౨౭౦) ధర్మార్థకామములలో నొకవేళ ధర్మమునకే ఎక్కువ వెచ్చమైనయెడల సంతోషింప వలెనేకాని దుఃఖింపరాదని యితనిమతము (ఆము. ౪-౨౮౨). కావు ననే శత్రువులయింటిస్త్రీలు చేతికిఁ జిక్కినప్పుడు పుట్టింటివారి వలె మర్యాదచేసి కాపాడవలె ననుట యితని యమూల్యమైన సిద్ధాంతము (ఆము. ౪-౨౬౭). 'కేవలేంద్రియప్రీతి బందీకృత పర కళత్రపథిక పరిమత్పరిహరణప్రాప్తవిత్తమ్ములఁ బాటచ్చర ప్రభులకు

జరుగదే?' (ఆము. ౪-౨౮౫) అని యితని ప్రశ్న. ఈ ధర్మ దృష్టిఁ గలిగిన సమర్థుఁడగు రాయలవంటివాని రాజ్యమున 'ఆబాలగోపాల మఖిల సద్ద్విజమును నానందమున మన్కి నతిశయిల్లె'నని పెద్దన చెప్పుటలో ఆశ్చర్యమేమున్నది? (మను. ౧-౩౪)

ఇంతేకాక రాయల నిజమైన యభిమానము పరమైకాంతిగా భగవద్భాగవత సేవ చేయుటయందుఁగలదే కాని సామ్రాజ్యభోగ భారములందు లేదని యూహింపవచ్చును. సామ్రాజ్యము జాతి ధర్మముచే వచ్చిపడినభారము. కావున దాని నాతఁ డార్జవముతో నిర్వహించెను. కాని యంతరంగ మందులో లేదు. దానిని నిర్వహించుటకు కావలసిన దంభము, ఆడంబరము, పక్షపాతము, వంచన, బండతనము, కూనీలు, కొల్లలు మొదలగు కార్యములు, ఎన్ని ధర్మ శాస్త్రముల సహాయముచే సమర్థించుకొన్నను, ఆర్ద్రహృదయునికి, ఆర్జవముగలవానికి అవి గిట్టుట యసాధ్యము.

> ''చంపి ధార్మికుండు, సతిఁబొంది మఱి బ్రహ్మ
> చారి, బొంకి సత్యశాలి, యార
> గించి సదుపవాసి, కేడించి శూరుఁడు,
> చిండి ధనియు, నగు విచిత్రసరణి''
>
> (ఆము. ౪-౨౭౮)

అని యెంత చమత్కారముగా పండితులు చెప్పినను, రాజు తప్పులను స్వార్థదృష్టితో వీరు సమర్థింతురే కాని వేఱుకాదనియు, 'రాజ్యాంతే నరకం ధ్రువమ్' (ఆము. ౪-౨౭౬) అనుటయే సత్యమనియు తోఁపకపోదు. పెద్దలు చెప్పెడు న్యాయధర్మశాస్త్రములకును, మనుష్యుని యాంతరంగికములగు నమ్మికలకును ఆదినుండియు యుద్ధ మఖండముగా జరుగుచునేయున్నది. రాయలవంటి తీవ్ర మనస్తత్వము గలవాని కది తప్పదు. అతఁడు శాస్త్రములకు విధిలేక తలవంచినాఁడు కాని, తక్కిన మనుష్యులకంటె రాజులు శ్రేష్ఠులనియు, వారి ధర్మాధర్మములే వేఱనియు మనఃపూర్వకముగా నమ్మలేదని నాకుఁ దోఁచుచున్నది. పెద్దన విషయమున నితనివర్తనమే యిందుకు సాక్ష్యము. మఱియు తన యాముక్తమాల్యదలోని కథానాయకుఁడనఁదగు విష్ణు

చిత్తునిచేత రాజులను మెప్పించుటచేఁ గలుగు 'ఖ్యాతి ఈతి' యని, 'లాభంబు క్షోభం'బని, 'పూజనం బుద్వేజనం'బని ఖచ్చితముగాఁ బల్కించినాఁడు (ఆము. ౧-౭౮). కావుననే పెద్దన్నకూడ తనకథానాయకుఁడగు ప్రవరుఁడు 'ఏభూపాలుఁ డీవచ్చినన్ సాలగ్రామము మున్నగాఁ గొనఁడు'' (మను. ౧-౫౫) అని గొప్పగా వర్ణించి రాయలసభలోనే చదివి చెప్పి అగ్రహారమును సంపాదించినాఁడు! రాజ్యము నేలుచు భోగము లనుభవించుట విధిలేక వచ్చిపడిన భారమనియు, ఆ కృత్రిమపు బ్రతుకునుండి యెంత వేగముగ తప్పించుకొన్న నంత సుఖమనియు పూర్వకాలము రాజులలో ననేకులును గమనించిన విషయమే. సూర్యవంశపురాజులు కొడుకు లెదిగివచ్చిన వెంటనే రాజ్యభారమును వారిపైఁ బెట్టి తాము తపోవనమున వానప్రస్థులై తపస్సు చేయుచుండిరను విషయము కాళిదాసు తవివిదీఱక సమయము దొరకినప్పుడెల్ల పొగడుచుండును. రాయల జీవితమందును ఇదే పరాయణముగా పనిచేసినది.

ఆయన తన యాముక్తమాల్యదలో ఐదుగురు రాజులను ప్రవేశపెట్టినాఁడు. వారిలో ఇద్దఱు కొంతవఱకు ఎద్దుమొద్దు రాజులు. తమవద్దిపండితులు పరస్పరము వాదించినప్పుడు ఎవరు గెలుతురో వారు చెప్పినట్లు నడచుకొను నమాయికులు. వారిలో మొదటివాఁడు పాండ్య మత్స్యధ్వజుఁడు. చాలదినములు భోగలోలుపుఁడై యుండి తుదకొక బ్రాహ్మణపండితుని మాటచే దైవభజనయం దాసక్తి వానికిఁ గలిగెను. వెంటనే పండితులను బిలిపించి యేదేవునిఁ గొలువ వలయునో మీరు మీరు కుస్తీచేసి నిర్ణయింపుఁడని యాజ్ఞ చేసెను. వారి వివాదములో వైష్ణవుఁడగు విష్ణుచిత్తుఁడు గెలిచెను. సరి; ఆ క్షణమే యితఁ డతని శిష్యుఁడై పంచసంస్కారములను బొందెను.

రెండవ దొరయు పాండ్యుఁడే. మత్స్యధ్వజుని పూర్వికుఁడు. వట్టి మత వేషముల దురాగ్రహము గలవాఁడు. చదువు సంధ్యలు సున్న. శైవపండితుల యుపదేశముచే ఆ మతమును గట్టిగాఁ బట్టుకొని యుండెను. శైవులు కానివారిని చాలకష్టపెట్టెను. శివభక్తు లేమిచేసినను పాపములేదు. మఱియు నదే న్యాయమని చెప్పిన బ్రాహ్మణులకే యగ్రహారముల దానము దొరకుచుండెను.

అట్టి బ్రాహ్మణులకును ఆకాలమందును కఱవుండలేదు. ఇంటిలో వేసికొన్న నామములన్నియు చెఱచుకొని, విభూతి గడ్డమువరకుఁ బూసికొని, రుద్రాక్షలు ధరించి, శివపురాణములు చంకలోఁ బెట్టుకొని వారు దొరగారి కొలువునకుఁ బోవుచుండిరఁట! ఇట్టివాని ముందఱ యామునాచార్యుఁడను తరుణబ్రహ్మచారి శైవపండితులతో వాదించి యోడించి విష్ణుపారమ్యమును స్థాపించెను. ఆ క్షణమందే తిరుమణి తులసిపూసలు ప్రత్యక్షమైనవి. విభూతి రుద్రాక్షలగతి, వానిని ధరించియుండినవారిగతి, యేమయ్యెనని యడుగఁ బనిలేదు. ఆ బ్రహ్మచారికే తనచెల్లెలినిచ్చి పెండ్లి చేసి అర్ధరాజ్య మతనికిచ్చి, ఆ రాజు మిగిలిన యర్ధమందు వీరశైవభోగములకు బదులుగా వీరవైష్ణవభోగము లనుభవించుచుండెను.

పై యిరువురిలో నెవరుగాని మతమును మార్చుకొనిరే తప్ప రాజ్యభోగములను వదలలేదు. కారణమేమనఁగా, వారికి పాండిత్యమును మెచ్చుకొను భక్తియున్నదిగాని విరక్తినిగలిగించు విద్యావివేకములు లేవు.

మూఁడవరాజు యామునాచార్యుఁడు. ఇతఁడు బ్రాహ్మణుఁడై గొప్పపండితుఁడైనను చిఱుతప్రాయపు బలముచే యుద్ధమం దాసక్తిగలిగి, మొదలు శైవులతో మీఁదఁజెప్పినట్లు వాగ్యుద్ధముఁజేసి యోడించి రాజును వైష్ణవునిజేసి యతని చెలియలిని పెండ్లాడి యర్ధరాజ్యమున కధికారియయ్యెను. క్షత్రియధర్మము నంగీకరించిన తరువాతఁగూడ ఇంకను ఈచప్పిడి బాపనయ్యల మాటల పోట్లాటలేల యని గొప్పసైన్యము ప్రోగుచేసికొని దిగ్విజయయాత్ర వెడలి జయించుకొని వచ్చెను. ఇతఁడు రాజ్యమునకు వచ్చినవెంటనే విజయయాత్ర పోవలసియుండెనుగాని వర్షాకాలమగుటచే నిలిచెనఁట. తరువాత శరత్కాలము. ఈ రెండు ఋతువులను వర్ణించుటకు సరిగా ౧౦౮ పద్యములను వినియోగించిన రాయలు, ఇతని దిగ్విజయమునెల్ల నొకటే పద్యములో ముగించియుండుట విచిత్రముగాదా! (ఆము. ౪-౧౮౫) క్షత్రియులకు విధిలేదుగాని యామునాచార్యునివంటి బ్రాహ్మణపండితుఁడు ఈ యుద్ధయాత్రకుఁ బూనుకొనుట న్యాయముగాదను తన యసహ్యామును

రాయ లిట్లు సూచించెనని నా యభిప్రాయము. కాని యంతటి పండితుని కీభోగతృష్ణ చాలకాలముండఁజాలదు. తన తాతగారి ప్రశిష్యుఁడగు రామమిశ్రుఁడు వచ్చి యుక్తిగా తన పొరఁబాటు నెఱిఁగించినతోడనే యతఁడు తెలివిఁదెచ్చుకొని రాజ్యభారమును తనకుమారునియం దుంచి తాను సన్న్యాసి యయ్యెను.

నాలవ మైదవవా రిద్దఱు అన్నదమ్ముల కొడుకులు. ఖాండిక్యుఁడు, కేశిధ్వజుఁడు; జాతిక్షత్రియులు. మొదటివాఁడు శ్రౌతస్మార్తకర్మములందు సమర్థుఁడైన పండితుఁడు. రెండవ కేశిధ్వజుఁడు బ్రహ్మజ్ఞాని. ఎంత చదువు, ఎంత జ్ఞానముఁ గలిగిన నేమి? ప్రాయమందు పాండిత్యము పనికిరానిది. వారిద్దఱు రాజ్యకాంక్షతో పరస్పరము యుద్ధముచేసిరి. బ్రహ్మజ్ఞాని కేశిధ్వజుఁడు గెలిచెను. కర్మఠుఁడు ఖాండిక్యుఁడోడి తనయెడ భక్తిగల మంత్రులు మొదలగు ననుచరులతోఁగూడ అడవులకు పాఱిపోయి తలదాఁచుకొనెను. మనుష్యసహజములగు లోభ మత్సరములతో పోరి గెల్చినను కేశిధ్వజుఁడు, ఆ రాజ్యభోగములలోఁ దగుల్కొనక, యోగనిష్ఠుఁడై యుండి భగవత్ప్రీతిగా నొక యజ్ఞముఁ జేయ మొదలుపెట్టెను. గ్రహచారమునకు ఆ యాగపశువు నొక పులి పట్టిచంపెను. కేశిధ్వజుఁడు పశుమరణమునకు ప్రాయశ్చిత్త మేమని యెందఱినో యడిగెను. 'ఈ విషయము నీవు రాజ్యము లాగుకొని యడవులకుఁ బోదోలిన ఖాండిక్యునికిఁదప్ప తక్కిన యెవరికిని దెలియదు' అని అందఱుఁ జెప్పిరి. సరేయని కేశిధ్వజుఁడు అతనివద్దకు నిర్భయముగా నిరాయుధుఁడై పోయెను. 'త న్నతఁడు చలముతో పట్టుకొని చంపినను యజ్ఞముకొఱకై చచ్చినట్లగును గాన యజ్ఞపూర్తి ఫలము వచ్చును; అట్లుగాక యుదారబుద్ధితో ప్రాయశ్చిత్తముఁ దెలిపెనా మేలేయగు' నని కేశిధ్వజుని సంకల్పము. ఖాండిక్యుఁడు మొద లితని యభిప్రాయ మెఱుఁగక తన్ను చంపవచ్చినాఁడని భ్రమపడి యుద్ధమునకు వచ్చినను, తెలిసినతరువాత మనఃపూర్వకముగా పశుమరణ ప్రాయశ్చిత్తమును జెప్పి పంపివైచెను. అడవిలో నిదానముగా కూర్చుండి యోజింప నవకాశము గలుగుటచే ఆ పండితునికి సహ

జముగా వివేకము గలిగినది. చేజిక్కిన పగవానిని చంపి రాజ్యము తిరుగా సాధింపుమని తన పరిజనులు, తనకై ఇల్లు, సంసారము విడిచి కష్టపడుచున్నవారు, నయభయములచే ఎంతబోధించినను వినలేదు. కేశిధ్వజుఁడు పోయి యజ్ఞము సాంగముగా ముగించి మరల ఖాండిక్యునివద్దకు వచ్చి 'నీకు గురుదక్షిణ యీయవలెనను కోరికతో వచ్చినవాఁడను; ఏమి కోరెదవు?' అని ప్రార్థించెను. అది విని ఖాండిక్యుని మంత్రులు మొదలగువా రుబ్బి 'నేఁడుగా దైవము తోడుగల్గె; గురుదక్షిణగా చతురర్ణవీవృతోర్వీవలయంబ శేషమును వేఁడుము' (ఆము. 3-౫౬) అని పుసలాయించిరి. కాని వాని కది నచ్చలేదు. కేశిధ్వజుని బ్రహ్మజ్ఞానము ఈవటకే పక్వమైనది. కాఁబట్టి తమ్ముఁ డడిగియుండినచో రాజ్యమంతయు మనసార నిచ్చియుండును. మఱియు ఆతఁ డడుగకయే అర్ధరాజ్యమిచ్చెద ననియెను. కాని ఖాండిక్యుఁడు మొదటివాఁ డిప్పుడు కాఁడు. అతఁడు కేశిధ్వజుని "నీ వధ్యాత్మరతుండవు; దక్షిణ గురున కీఁదలఁచితేని సకలభవక్లేశసంక్షయంబెయ్యది యవ్విద్య బోధింపుము" (ఆము. 3-౬౦) అని ప్రార్థించెను. అతఁ డితని విరక్తికి సంతసించి సరహస్యముగా యోగవిద్య నుపదేశించి, తరువాత బలవంతముగా నతని యర్ధరాజ్యము అతని కిచ్చిపోయెను. కాని ఖాండిక్యుఁ డా రాజ్యము ననుభవింపలేదు. తన కుమారుఁడు చిన్నవాఁడైనను వానికే పట్టముగట్టి, రాజ్యమునకై యాశపడిన మంత్రి పరిజనులచేత వాని నప్పగించి, తాను యోగనిష్ఠుఁడై భగవద్భజనతో ముక్తుఁడయ్యెను. కేశిధ్వజుఁడు తనకు పుత్రులులేమిచేఁ గాబోలు, రాజ్యము నేలుచున్నను పుణ్యపాపములు రెండును క్షయించి ముక్తి గలుగు మార్గమును సాధించుచుండెను.

ఆముక్తమాల్యదలో పై ముగ్గురిచరితమును ఎంతయభిమానము, భక్తి గలిగి రాయలు వర్ణించినాఁడో గమనించితిమేని అతనికి భోగములకంటె యోగము దెక్కువ యాశ యుండెననుట స్పష్టపడును. యామునాచార్యునివలె, ఖాండిక్యునివలె రాజ్యభారము తన కుమారునకిచ్చి తాను శాంతిచిత్తముతో సామాన్య మనుష్యునివలె భగవద్భజనతో కాలక్షేపము చేయవలెనని రాయ లెంతో

యూసపడియుండె ననుటలో సందేహము లేదు. కావుననే యేడేండ్ల కుమారుఁడు తిరుమలరాజును 'వీరప్రతాపతిరుమలదేవరాయ' నిగాఁజేసి పట్టాభిషేకము చేసెను. కాని పాప మాయాశ యెంత నిష్ఫలముగా, శోచ్యముగా ముగిసినదియు నందుచేత మనసు చెడవిఱిగి, అవసానకాలమున రాయ లెట్టి రాక్షసుఁడుగా పరిణమించి నదియు చరిత్రములు చెప్పఁగలవు. అది వేఱుమాట.

రాజధర్మమును రాయలు గుర్తెఱిఁగి నడచెనేకాని ప్రజా ధర్మమును మనము గమనింపక పోతిమి. పారతంత్ర్యప్రీతి బీజము నాఁటికే వేఱూని మొలకెత్తియుండెనని చెప్పితిని. 'రాజా కాలస్య కారణమ్' అని నమ్మి అతఁడేమి చేసినను చేయించుకొనుట తప్ప, పరశురామునివలె అధర్మము నెదుర్కొని తిరుగఁబడి పోరాడు కాల మప్పటికే పురాణములపాలై పోయియుండెను. ఆత్మశక్తి యందలి నమ్మిక యణఁగిపోయియుండెను. 'నావిష్ణుః పృథివీపతిః' అనియు, 'అష్టాభి ర్లోకపాలానాం మాత్రాభి ర్నిర్మితో నృపః' అనియు నమ్మి, మనలను కాపాడుటకై బ్రహ్మదొరల నప్పుడప్పుడు తయారు చేసి మననెత్తిపై పడవేయునని తలఁచి తలవంచుకొనిరే కాని, ప్రభువును తయారుచేసిన బ్రహ్మ ప్రజకుమించి వేఱు లేదని తలచినవా రాకాలమందే లేరైరి. రాయలును, రాజేశ్వరాంశసంభూతుఁడనియే నమ్మెనుగాని, యతఁడు,

'ప్రజాపాలనంబు పనిగాఁ బ్రజానాథుండు బహుముఖంబులం బుట్టింపం బుట్టి, విరాట్సమ్రాట్ప్రభృతి వేదోదితశబ్దవాచ్యుండై దేవసదృశుండగు మూర్ధాభిషిక్తుఁడు సోఁకోర్చి యిలకు నగు నల జళ్ళు తీర్చినంగాక జన్మంబు సఫలంబగునె?'

(ఆము. ౪-౨౬౫)

యని తలఁచిన ధర్మబద్ధుఁడు. కాని యింతటి ధర్మదాస్య మెందఱికిఁ గలదు? ఆ లోచూపుగలిగి తనకృత్యము తానెఱిఁగి నెరవేర్చు 'రాజ్యాశ్రమమునులు' రాజులలో నెందఱుగలరు? ఎట్లు కల్గుదురు? దుష్టశిక్షణమును, శిష్టరక్షణమును రాజుల ధర్మమైనచో వారి దుష్టత్వములకు, శిష్టత్వములకు శిక్షణ రక్షణములు చేయు ధర్మ

మెవరిది ? రాజుకు పన్నులిచ్చి, కానుకపెట్టి, పెద్దవని పొగడి, మ్రొక్కి, సమయములందు ప్రాణములు ధారపోసి రక్షించువారు ప్రజలుకారా ? వానిని శిక్షించు నధికారముమాత్రము యమధర్మ రాజుదా ? అంతవఱకు అఖండముగా ప్రజ లీ భూలోక నరకబాధ లనుభవింపవలసినదేనా ? ఆ యమునివద్ద కీ యముఁడు పోయినప్పుడు వాఁడు వీనిని శిక్షించునో, లేక శిక్షించు పద్ధతుల నతనియొద్ద నేర్చుకొని శిష్యుఁడై గురువుగా గౌరవించునో యెవ రెఱుఁగుదురు ? ఈ నిరర్థకములైన, అనర్థకములైన, రాజభక్తి శాస్త్రపు సంకెళ్ళు ఇంతబరువుగా భద్రముగా వేసికొనుటచేతనే, అవి త్రుప్పుపట్టి కారణాంతరములచే తునిఁగిపోవుచున్నను నేఁటికిని ప్రజలు కాళ్ళు కదలింపలేకున్నారు. కూర్చుండి తినమఱిగిన రాజులలో ననేకులు 'మేములేకున్న మా ప్రజలు తమపాలి మహావిష్ణువే యంతర్ధాన మైనట్లు దుఃఖింతురు' అని బైటివారిని బేలుపుచ్చుచున్నారు. భక్తియను మాఱుపేరుగల యీ మన బండతనమే నాఁటికిని నేఁటికిని రాజులనఁబడువారు చేయు రాక్షసకృత్యములకెల్ల శ్రీరామరక్షగా పరిణమించినది.

కాఁబట్టియే కృష్ణదేవరాయలవంటి మహాపురుషుఁడు, ఉదారహృదయుఁడు, ధర్మబద్ధుఁడు, ప్రయత్నించినను సరియైన స్వాతంత్ర్యమును ప్ర[illegible]లు పడయలేకపోయిరి. తప్పు మనదికాని యతనిది కాదని యెఱిఁగితిమిగదా. కావున నాకాలపు స్వాతంత్ర్య మనునది పరతంత్రమునకు మాఱుపేరేకాని వేఱుకాదు. ఇప్పుడు మనము కోరునది, కోరవలసినది యదికాదు. కాలము మాఱినది. భావములును మాఱినవి ; మాఱవలసియున్నవి. ప్రజలకు ప్రభువు పరతంత్రుఁడు కానిపక్షమున, ప్రభుత్వమునందలి లోపములను సవరించు అధికారము, ఆసక్తి ప్రజలకు లేనిపక్షమున, ఆ ప్రభువులు మన పల్లకీలు మోసినను అది మనలను క్రింద పడఁగెడపుటకే, కాళ్లకు గండపెండేరములు చేతులతోఁ దొడగినను అది మనలను కట్టివేయుటకే పనికివచ్చునుగాని వేఱుకాదు. మన మంచిచెడ్డల భారమును మఱియొకరికంటఁగట్టక మనమే నిర్వహించుకొను సామర్థ్యము సంపాదించుట యిప్పటి మన ప్రయత్నము. కాఁబట్టి

శ్రీకృష్ణదేవరాయలే నేఁడు మనభక్తికి మెచ్చి మరల ప్రత్యక్షమై ముందఱనిల్చి 'మీ దారిద్ర్యమును, పారతంత్ర్యమును దీర్చి శత్రువులను జయించి చక్రవర్తిగా సామ్రాజ్యమును బాలించి శాంతి నెలకొల్పెదను' అని వరమీయ వచ్చినను 'అక్కఱలేదు, మహానుభావా! నీవంటి మహాపురుషుల మనసును మరల నొప్పించుటకు మా కిష్టములేదు' అని మర్యాదగా కృతజ్ఞతతోఁ బదులు చెప్పఁగల ధైర్యమును, వివేకమును మన మీ యొక్క పూటనైనను అలవఱచుకొనఁగలమేని, ఈ యుత్సవముచే రాయల యాత్మకు నిజమైన తృప్తియు శాంతియుఁ గలుగఁగలదు.

"ఓం, సహనావవతు; సహనౌ భునక్తు; సహవీర్యం కరవావహై;
తేజస్వినావధీత మస్తు; మా విద్విషావహై, ఓం."

# నాచన సోముని నవీన గుణములు

## 3

కవిత్రయముకన్న గొప్పవాఁడని, 'అఖిలంబున యతిని డాఁచినట్టి సర్వజ్ఞుఁ'డని, – నాఁటినుండి నేఁటివఱకు పొగడ్తఁగన్న నాచన సోమనాథుని కవిత్వ మంత యుత్తమజాతికిఁ జేరదని చెప్ప సాహసించి పలువురు పండితుల మనసు నొప్పించిన యపరాధిని నన్నే మీ రీనాఁడు అతని జయంత్యుత్సవములో అధ్యక్షునిగా నెన్నుకొని సాహిత్యప్రపంచమందు మీకుఁ గల స్వాతంత్ర్యరసికతను వెల్లడించితిరి. మీ యౌదార్యమునకు కృతజ్ఞుఁడను.

నాచన సోమునికిని నాకును షష్ఠాష్టకమని కాని, అతని కవిత్వమందు నాకు రుచి లేనేలేదని కాని యెవరైనను భావించువారు కలరేని అది పొరఁబాటని మనవిచేయుచున్నాను. 'అతనికన్న నీవు గొప్పపండితుఁడవా? అతనికన్న మెఱుఁగుగ కవిత్వము చెప్పఁగలవా?' యని ప్రశ్నించువారును ఉండవచ్చును. కాని యిది యెట్లున్నదనఁగా; 'బాదామి' మామిడిపండులో 'రసపూరి' మామిడిపండుకంటె సుగంధమును, తీపియు తక్కువయని చెప్పినవానిని జూచి, 'నీ దేహమం దంతకంటె మంచి వాసనయు, నీ కండలం దంతకంటె ఎక్కువ తీపియును గలదా?' యని యడిగినట్లున్నది. రుచి ననుభవించువానికి రుచిని గల్పించుశక్తియు నుండవలయునని చెప్పుట, వంటనేర్చినవారికిఁదప్ప తక్కిన యెవరికిని భోజనమం దధికారము లేదని చెప్పుటవంటిది. మరియు రుచిలో ఎక్కువ తక్కువలు గమనించినమాత్రమున తక్కువయైనదానిని పూర్తిగా ద్వేషించి వదలిపెట్టువారును లేరు. తీపి, సుగంధము కొంత తక్కువయని బాదామిపండును తిననివా రెవరున్నారు? తిని సంతోషింపనివా రెవరున్నారు? అట్లే సోముని పద్యము లనేకములు నామనసులో నాఁటి నిలిచినవి. ఎన్నియోమారులు నాకును దెలియకయే నాయంతకు నేను పాడుకొని సంతోషించు పద్యము లతని వెన్నియో కలవు. నామాట యేమికాని యెవ

రును అట్లు చేయకయుండ లేరనుట నిస్సందేహము. నేడు మీరు దయతో నిచ్చిన యీ యవకాశమునందు ఇంతగా మనలను లోపఱచుకొన్న యతని కళాస్వరూపమును కొంతవిరివిగా మననము చేసికొనఁదలఁచినాను.

నాచన సోముఁడు 'నవీనగుణ సనాథుఁడు.' తన యుత్తర హరివంశమునందలి యాశ్వాసాంతగద్యలలో అతఁడే తన కా విశేషణమును వేసికొన్నాఁడు. ఆ నవీనగుణములు అతని వ్యక్తికిఁగాక రచించిన కావ్యమునకే సంబంధించినవని చెప్పవలయును. అతఁడు తన నిత్యజీవనమందు ఎట్టి యెట్టి క్రొత్తగుణము లలవరించుకొనెనో మన మెఱుఁగము. అతని కవితాధారయందు అతనికన్న ప్రాచీనులలో అంతగా వ్యాప్తికిరాని కొన్నిగుణములు మనకుఁ గానఁబడుచున్నవి.

సోమునికంటె ప్రాచీనులగు కవులలో మనకు ముఖ్యముగా కానవచ్చువారు నన్నయ, తిక్కన, ఎఱ్ఱన, నన్నిచోడుఁడు మొదలగువారు. ఎఱ్ఱనకంటె సోముఁడు ప్రాచీనుఁడని సాధింపఁ గొందఱు చేసిన ప్రయత్నములు సఫలములు గాలేదు. సోముని హరివంశమును ఎఱ్ఱన్న హరివంశమును పోల్చిచూచినచో ఎఱ్ఱన ననుసరించియే సోముఁడు వ్రాసెనని తోఁచుననుటలో సందేహము లేదు. ఇప్పు డా రెండు గ్రంథములును మాత్రము పోల్చిచూచుట నాపని కాదు. కావున ఆ విషయ మట్లుండనిత్తము.

ప్రాచీనులలో లేనివి, సోమునియందుఁ గలవి యగు నవీన కళాగుణము లేవి? ఈ విషయమును వివరించుటకు ముందు కవితాకళయందు మన కిదివఱకుఁ గానవచ్చు సామాన్యగుణముల స్వరూపమును గమనించుట యప్రకృతము గాదు.

చిత్రలేఖనము, సంగీతము మొదలగు ఇతరకళలన్నిటివలె కవిత్వమునందును ప్రధానముగా నుండెడు తత్త్వములు రెండు: భావము, వస్తువు. భావములు ప్రేమ, కోపము, అసహ్యము, ఆలత్స్యము, దయ మొదలగు ప్రాణిధర్మములని వేరుగా చెప్పఁ బనిలేదు. వస్తువు అనఁగా ప్రకృతియందుఁ గానవచ్చు జాతి, గుణము, క్రియ, మొదలగు వివిధపదార్థములు. పై భావములు మన మనస్సునందు పుట్టకయున్నప్పుడు, పై వస్తువులు మనయెదుట

లేనప్పుడు వాని ననుభవించునట్లు, వీనిని సాక్షాత్కరించునట్లు చేయుటయే కళావంతుని పనితనము. వస్తువులు లేని భావములు కాని, భావములు లేని వస్తువులుగాని యుండుట యరుదైనను ప్రాధాన్యమునుబట్టి భావకళలని, వస్తుకళలని మనము విభాగము చేయవచ్చును. ఈ తిక్కనసోమయాజి పద్యమును భావకళ కుదాహరింపవచ్చును. సుకుమారియైన ద్రౌపది విరాటనగరము త్రోవలో భర్తలవెంబడి నడచి నడచి చేతఁగాక యిట్లనుచున్నది :

ఉ. డప్పిజనించె ; వ్రేళుల పుటంబులు
పొక్కఁదొడంగె ; గోళ్ళలోఁ
జిప్పిలఁ జొచ్చె నెత్తురులు, చిత్తము
నాకుఁ గడున్ వశంబుగా ;
దప్పర మిచ్చటచ్చటను నాసల వ
చ్చితి ; నెంతదవ్వొకో !
యిప్పటిభంగి నొక్కఁడుగు నేఁగెడు
దానికి నోర్వనెమ్మెయిన్.

(భార. విరా. ౧-౧౮౮)

ఇందలి వ్రేళ్ళు పొక్కుట, గోళ్ళలో నెత్తురువచ్చుట మొదలగు పదార్థములున్నను ద్రౌపదికిఁ గలిగిన ఆయాసము, నొప్పి, దైన్యము మొదలగు భావములే ముఖ్యముగా ఆస్వాదనీయములు. ఇట్లే నన్నయభట్టు వ్రాసిన కడపటి పద్యము వస్తుకళ కుదాహరణమగును.

ఉ. శారదరాత్రు లుజ్జ్వల లసత్తర
తారకహారపంక్తులం
జారుతరంబులయ్యె, వికసన్న
వకైరవగంధబంధురో
దారసమీరసౌరభము దాల్చి
సుధాంశువికీర్యమాణక
ర్పూరసరాగపాండురుచిపూరము
లం బరిపూరితంబులై.

(భా. అర. ౪-౧౪౨)

ఇందు చంద్రుఁడు, నక్షత్రములు, కలువలు, వెన్నెల మొదలగు సహజరమణీయపదార్థముల కూర్పే, వాని విషయమై కర్తకుఁ గలిగిన సంతోషము అనుభావమునకన్న ప్రధానముగాఁ గానవచ్చును.

ఇట్లు భావము, వస్తువు అను రెండు తత్త్వములలో మనుష్యుఁడు వస్తువుకంటె భావముల కెక్కువ లోపడి పరవశుఁ డగుచున్నాఁడు. కారణ మిది : భావములు ప్రాణిధర్మములు. ప్రాణులలో నెల్ల తా నుత్తముఁడని మనుష్యుఁడు భావించుకొనుచున్నాఁడు. ఇతర ప్రాణులు వీని కా గౌరవము నిచ్చునో లేదో యనుట వేఱుమాట. తక్కిన చేతనములకన్న మనుష్యులలో భావములసంఖ్యయు, వైవిధ్యమును, తీవ్రతయు ఎక్కువయనుట స్పష్టమే. కావుననే మనుష్యులకు భావము ముఖ్యధర్మముగా నేర్పడినది. అది యెక్కడఁ గానవచ్చినను తనకు సులభముగా గ్రహింపనగును గావున తక్కినవానికన్న దానికి మనుష్యుఁడు ప్రాముఖ్యమిచ్చి లోపడుట సహజమైనది. కనుకనే కళలయందుఁగూడ వస్తుప్రధానములకంటె భావప్రధానములైన వానికే మానవచిత్తవృత్తిపై బలమెక్కువ. పూవులు, తీగలు మొదలగు అచేతనవస్తువులను అచ్చుగొట్టినట్లు చిత్రించువానికన్న భావపూర్ణములైన సచేతనములను – అందును మనుష్యవ్యక్తులను – చిత్రించువానియెడ మనకు గౌరవమెక్కువ. నాటకరంగమందు ఉద్యానములు, మందిరములు, కొండలు, సముద్రములు మొదలగు పదార్థములను సహజముగాఁ జూపి ఎంత కన్నులు దనిపినను, మనము —అనఁగా చిత్తసంస్కారముగలవారు – ముఖ్యముగా డబ్బిచ్చి చూడఁబోవునది వానినిగాదు; మఱి వేఱువేఱు భావములతో నిండిన పాత్రముల యభినయమును. బేలూరి చెన్నకేశవుని దేవళమును జూచినప్పుడు అందలి ద్వారపాలక విగ్రహముల కిరీటములందలి చెక్కడపు నయగారమును, చుట్టును వరుసలు వరుసలుగాఁ దీర్చిన దేవ మానవ తిర్యగ్జంతువుల చదరపుఁ జక్కదనమును మన మెంత మెచ్చుకొన్నను, మనలను నిజముగా భ్రమాన్వరచి తెప్పలార్పక చూడఁజేయునవి మూలమూలలందును మదనచేతులపై నల్లశిలలోఁ దీర్చి నిలిపిన ఆటవెలఁదిబొమ్మల అపూర్వాభినయములే. గాయు

కుఁడు పాడునప్పుడుగాని, వాయించునప్పుడుగాని కోకిలకూఁతవలె సుకుమారముగ, సింహగర్జనవలె గంభీరముగ, సెలయేటి జలజలలవలె లలితముగ వెడలించు నాదపదార్థము ఎంతమనోహరముగ నున్నను, అతఁడు స్వతంత్రముగా భాషకందని భావభేదములతో చేయు రాగాలాపన మొదలగునవే రసికుల కెక్కువ హృదయంగమముగా నుండును.

వస్తువులకంటె భావములకు ఈ సహజమైన ఆకర్షకశక్తి యుండఁబట్టియే ఆవస్తువులను చిత్రించునప్పుడుగూడ కవులు తాము తటస్థులై యున్నదున్నట్లు వ్రాసి తృప్తిపడక, వానియెడ తమకు సొంతముగాఁ గలిగిన ప్రీతి, ద్వేషము మొదలగు భావములు ధ్వనించునట్లుగనే రచింతురు. మఱియు నిర్జీవపదార్థములకు ప్రాణిత్వము నారోపించి భావరచన కవకాశముఁ గల్పించుకొందురు. చంద్రుఁడను వస్తువును వర్ణింపఁబోయి పెద్దన యీ క్రింది పద్యమున భావము నెంత ప్రధానముగా నించినాఁడో చూడుఁడు :

సీ. కలశపాథోరాశి గర్భవీచిమతల్లి
కడుపార నెవ్వానిఁ గన్నతల్లి ;
అనలాక్షుఘనజటావనవాటి కెవ్వాఁడు
వన్నె వెట్టు ననార్తవంపుఁ బూవు ;
సకలదైవతబుభుక్షాపూర్తి కెవ్వాని
పుట్టుకామని లేని మొట్టపంట ;
కటిక చీఁకటి దిండికరముల గిలిగింత
నెవ్వాఁడు తొగకన్నె నవ్వఁజేయు ;
అతఁడు వెలుఁగొందు మధుకైటభారి మఱఁది ;
కళల నెలవగువాఁడు చుక్కలకు ఱేఁడు ;
మిసిమి పరసీమ ; వలరాజు మేనమామ ;
వేవెలుంగులదొరజోడు రేవెలుంగు.

(మను. ౧)

ఇందలి చంద్రుఁడు కేవలము గుండ్రముగా తెల్లగా చల్లఁగా నుండు వస్తువుగాక, కన్నతల్లి కడుపు చల్లఁజేయుకొడుకై, ఈశ్వ

రునికిఁగూడ రక్తిగలిగించిన సౌమ్యుఁడై, దేవతలకుఁగూడ అమృతాన్నదానము చేయు నుదారగృహస్థుఁడై, కన్నెలను వలపించి వశపఱచుకొనఁగల రసికుఁడై, గొప్పవారిలో గొప్పవాఁడై, సుందరులలో సుందరుఁడై కానవచ్చి మన హృదయములందు మెప్పు అను భావమును పలువిధముల నుద్బోధింపఁ జేయు చున్నాఁడు.

భావములతో నేమాత్రమును సంబంధములేని వట్టి పదార్థములకూర్పు ఎండిసవరుగు గంపకెత్తిన ట్లుండును. కవు లట్టివి గూడ నప్పుడప్పుడు వ్రాయుట కలదు. ఎట్లన హరివంశమున కైలాసయాత్రకుఁ బోయిన శ్రీకృష్ణుని జూచుటకు,

సీ. వ్యాస భరద్వాజ వాల్మీకి గౌతమ
కాశ్యప జాబాలి కణ్వ పులహ
యాజ్ఞవల్క్యాత్రి రైభ్యాంగిరో భృగు పరా
శర ధూమ్ర గాలవ శంఖ లిఖిత
హారిత సంవర్తక హయశిర శ్శౌనక
భద్రకటీ సద్విభాండ కోగ్ర
బక దాల్భ్య కౌశి కాపస్తంభ మాండవ్య
మంకణ రోమశ మందపాల

కథకలాప రోహిత కాముకాయనాది
మునులు చిరతపోనిర్మలమూర్తు లాఢ్యు
లరుగుదెంచి కాంచిరి పరమాత్ము నభవు
నాదిదేవు నచ్యుతుఁ గృష్ణు నధికభక్తి.

(హరి. ఉ. భా. ఆ. ౫).

కృష్ణునియెడ మహర్షులకుఁగల భక్తియు, వారియందు కవికిఁ గల గౌరవము అనుభావము చాల పలుచగా ఎత్తుగీతియందు కానవచ్చునేకాని యందాఁక నున్నదెల్ల శుద్ధశుష్కసమాసపుకంప.

కాని, ఇందులోఁగూడ చదువరుల నాకర్షించు కళాతత్త్వమొకటి లేకపోలేదు. లేకున్న కవు లట్టివి వ్రాయనే వ్రాయరు. వట్టిపేర్లపట్టీ యీయవలసినప్పుడు వ్యాసులవలె,

భవాన్ భీష్మశ్చ కర్ణశ్చ కృపశ్చ సమితింజయః
అశ్వత్థామా వికర్ణశ్చ సౌమదత్తి స్తథైవచ.
(గీత. అ. ౧-శ్లో. ౮)

ఇట్లు నిరర్థకపదములతో తేపలువేయక, యతి ప్రాస గణాది నియమములఁ జెఱుపక, పై ఎఱ్ఱనసమాసమువలె ఒకమాలికగాఁ గూర్పఁగల్గుట యందరికిని సులభముగాదు. దానిని గుర్తించి కొంత సంతోషించు స్వభావము మనుష్యుల కున్నది గావుననే ఇట్టి రచనలును వ్యాప్తికి వచ్చినవి.

ఈ ప్రస్తావముచే భావవస్తువులకు తోడుగా తక్కిన కళల వలె కవిత్వమునందును మూఁడవ తత్త్వ మొకటి కలదని మనము గమనింపవలసియున్నది. అదేదనఁగా: రచన. అనఁగా ఆ భావ వస్తువులను వెలువఱుచు పద్ధతి. ఇది ఆ రెంటిని దెలుపు వాక్యములు, వాక్యములను గూర్చు పదములు, ఆ పదములను లోఁగొన్న శైలి, ఛందస్సు, మొదలగువానియందు గానవచ్చును. చిత్తరువునందు వన్నెలు, పలక, చౌకట్టు మొదలగువానివలె; గానమందు రాగభేదములు, శ్రుతి, తాళము, ఇత్యాదులట్లు; నాటకమునందు వేషము, పాట, పద్యము, మున్నగువాని రీతి; రచన కవిత్వకళకు బహిరంగమగు ప్రకృతి. భావవస్తువు లంతరంగములు. కళావ్యక్తికి భావము జీవమని, వస్తువు బుద్ధియని, రచన శరీరమనియుఁ జెప్పవచ్చును.

కాన ప్రధానమైన కళాంగము భావము. దానికి వస్తువును, ఈ రెంటికిని రచనయు పరాధీనములుగా నుండవలయును. అదే యుత్తమకళ. కాని తక్కిన రెంటికిని స్వతంత్రముగా మనల నాకర్షించు శక్తికలదు. భావ మెంతతీవ్రముగా సూక్ష్మముగా నుండిన నంత యానందము గలుగును. వస్తు వెంతసహజముగా విరివిగానుండిన నంతతృప్తి గలుగును. రచన యెంత యపురూప ముగా కష్టముగా నుండిన నంత యాశ్చర్యము గలుగును. కాని తీవ్రమైన భావములు సూక్ష్మములైన వాని నడకలు చూపుట యందఱికిని అన్నికాలములందును అబ్బిన విద్యకాదు. కోపము నెందఱు వర్ణించినవారు లేరు? కాని, ద్రౌపదికి సభలో తనకన్నుల

యెదుర కీచకునితో నవమానము గలిగినప్పుడు భీముని హృదయమున రేగిన కోపమును మన కవిబ్రహ్మ వర్ణించిన భావోన్మీలన పద్ధతి యందలి రహస్యము తెలుఁగులో నింకెవరికి లభించినది ?

సీ. నేలయు నింగియుఁ దాళములుగాఁ జేసి
యేపున రేగి వాయించి యాడఁ,
గులపర్వతంబులు గూల్చి యొండొంటితోఁ
దాఁకంగ వీఁకమైఁ దన్ని యాడ,
నేడు సాగరములు నిక్కడక్కడఁ బెట్టి
పలుచని రొంపి మైనలఁదికొనఁగ,
దిక్కులు నాలుగు నొక్కచోటికిఁ దెచ్చి
పిసికి పిండలిచేసి పిదుచగొనఁగ,
మిగుల బ్రహ్మాండ భాండంబు పగుల వ్రేయ
నప్పళించుచుఁ బ్రళయకాలానలమున
గండరించిన రూపంబు కరణి భీముఁ
డతిభయంకరాకారత నతిశయిల్లె.

(భా. విరా. ౨-౧౩౮)

మఱియు కీచకు నిల్లఁ జంపించి కృతకృత్యయై అంతఃపురము నకు మరలివచ్చు వేళలో ఉక్కివచ్చెడు సంతోషమును అడఁచుకొనఁ బ్రయత్నించు ద్రౌపది సూక్ష్మభావభేదములను దెలుపు ఈ క్రింది పద్యమువంటివి తిక్కనమాత్ర మెన్ని రచించినాఁడు ?

సీ. ముదమున నెలమి సొంపొదవి నెమ్మొగమునఁ
దోఁపంగవచ్చినఁ ద్రోచి త్రోచి,
లలినుల్లసిల్లుచు లలితలోచన దీప్తు
లడర నుకించిన నాఁగి యాఁగి,
సంతసంబున బాలిశముఁలగు చెయ్వులు
దొడరఁజూచినఁ జేయ కుడిగి యుడిగి,
మనసున నుబ్బుమై మాట నాలుకకు రాఁ
గడఁగిన నాడక కడపి కడపి,

ధీరమై యిట్లు సమ్మదపూరమునకు
గరువతనమను బలితంపుఁ గట్ట వెట్టి,
వెలఁది యెఱుఁగనియదివోలె విక్రృతిలేక
యల్ల నెప్పటియట్టుల యరుగుటయును.

(భా. విరా. 3-౫౬)

ఇంతటి భావభారమును భావించు శక్తి లేనప్పుడు కవులు వస్తుప్రధానమైన కళకు దిగుదురు. సహజముగా మన యనుభవమునకు మీఱకయుండిన పక్షమున అదియు మనకు తృప్తిఁ గల్గించునని చెప్పితిని ఎట్లన వర్ణించిన యీ క్రింది బాలకృష్ణలీలలు చదివి తృప్తిపడని రసికుఁడెవఁడైన నుండునా?

సీ. పాలుపారగా బోరగిలి పాన్పు నాల్గుమూ
లలకును వచ్చుచు మెలఁగి మెలఁగి,
లలిఁ గపోలంబులు గిలిగిలింతలుపుచ్చి
నవ్వింపఁ గలకల నవ్వి నవ్వి,
ముద్దులు దొలుకాడ మోఁకాలఁ గేలను
దడవుచు నెందును దారి తారి,
నిలుచుండఁబెట్టి యంగుళి యూఁత సూపఁగా
బ్రీతిఁ దప్పడుగులు పెట్టి పెట్టి,
'అన్నఁగంటి, దండ్రినిగంటి, నయ్యఁగంటి,
నిందురావయ్య, విందులు విందు' లనుచు
నర్థిఁ దనుఁ బిలువఁగ నడయాడి యాడి
యుల్లసిల్లె గృష్ణుఁడు శైశవోత్సవముల.

(హరి. పూ. ఆ. ౫)

భావమును గౌణముగాఁ జేసి వస్తు వెట్లు స్వతంత్రమై నిలుచునో యట్లే ఆ రెంటిని అడఁగఁద్రొక్కి రచనయు స్వతంత్రముగా జనుల నాకర్షింపఁ బ్రయత్నించును. పై రెంటికంటె దీనియందు కవి పాండిత్యమును, సాహసమును స్పష్టముగాఁ బ్రదర్శింప వీలు కలదు. కవికిని చదువరికిని ఇందులో నేరుగా సంబంధముగలదు. భావకళలో చదువరి తన్నే మఱచిపోవును. పై నుదహరించిన

'నేలయు నింగియు' పద్యమువంటి పద్యమును జదువుచున్నప్పుడు మనము భీములమే యైపోయి, ప్రక్కనున్న వారికెల్ల నొక చెంప దెబ్బ యిత్తమనిపించునేకాని, దానిని వ్రాయుటకై తిక్కన సోమయాజి యెంత కష్టపడెనో పడనేలేదో విచారించుటకు మనకు తెఱపి యెక్కడిది? ఇట్లే వస్తుకళలోను కవి పచరించిన పదార్థములపై నున్నంతదృష్టి కవిపై నుండదు. ఇఁక రచనలో నట్లు కాదు. కవి చిత్రములైన త్రోవలలో క్రొత్తమాటలు, క్రొత్త కూర్పు మొదలగునవి కల్పించి చూపునప్పుడు అతని వ్యక్తియే మన కన్నులయెదుర నిలచి బలవంతముగా మన మెప్పును లాఁగుకొనును. ఈ క్రింది నాచన సోముని పద్యమునందలి ఆశ్రమ వర్ణనము గమనింపుఁడు :

సీ. పవనవేగవిశీర్ణ పాదపాగ్రంబుల
జడియకుండఁగఁ బట్టు సామజములు,
పూజార్థనియమిత పుష్పమాలికలపై
మధుకరంబులఁ జోపు మర్కటములు,
అవభృథస్నాన పర్యంతనిర్మలతకై
కాసారములఁ గాచు కాసరములు,
నిజనిజోటజభాగ నీవారసీమలు
సారక కావలియుండు సూకరములుఁ

గలిగి కంసవైరి కన్నుల పండువై
పొలుపు మిగిలెఁ బూర్ణకలశ విగళ
దాలవాల వారి హారితమునిదారి
కాశ్రమంబు బదరికాశ్రమంబు.

(ఉ. హ. ౨-౧౦౯)

ఇందు శాంతి, అస్తేయము, అహింస, భక్తి మొదలగు భావములు మూలతత్త్వములేయైనను వర్ణింపఁబడిన వస్తువుల విచిత్రమగు నడవడిముందు ఆ భావములు దుర్బలములైనవి. కోఁతులు, పందులు మొదలగు జంతువులకే యింతటి వైరాగ్యము, భక్తియుఁ గలచోట అవి కావలియుండుట యిం కెవరికొఱకు?

మర్కటములకున్నంత బుద్ధి మధుకరముల కేల లేదయ్యెను? ఇత్యాది ప్రశ్నలు తోఁచి సమాధానము సరియైనది దొరకక పోవుటఁబట్టి సహజత్వము సరిగా స్ఫురింపదు గావున పై వస్తువులును మనకు తృప్తిగలిగింపవు. పై జంతువులం దెన్నఁడును మనము చూడని విచిత్ర విరుద్ధ కార్యములను గల్పించుటయందలి కవి చమత్కారమే ఇందలి మన రుచికి మూలబీజము. ఈ పద్యమును జదివినప్పుడు "ఏమి! ఎట్లున్నది? ఆ!" అని నవ్వుమొగముతో నాచన సోముఁడే ఎదుట నిలిచి మన చేత బలవంతముగా 'బలే' యనిపించునట్లు నాకుఁ దోఁచును.

రచనయందలి పై 'నవీనత' అర్థమునకు సంబంధించినది. దీనికంటె శబ్దమునకు జేరిన రచనలో కవి యింకను మూర్తిమంతుఁడై మనకు ప్రత్యక్షమగును. రాఘవపాండవీయమందలి యీ క్రింది పద్యము వినుఁడు :

క. మగల యిలువరుసఁ గలపెను
దగవరు లోకఁ డోకఁ డొకొక్క తనయు రుచిరశౌ
ర్యగతి నుతిఁ జెంద ఘనకీ
ర్తిగ నలరంగలరు ద్రోవదివరక్రమతన్.

(రాఘు. ౨౯౭)

ఈ పద్యమును జదివి యర్థము చేసికొన్న తరువాతఁగూడ మన హృదయముల నిల్చువ్యక్తి రామాయణవీరుఁడగు లక్ష్మణుఁడు గాఁడు, భారత వీరమాతయగు ద్రౌపదియుఁగాదు! మఱి శ్లేషకళా చక్రవర్తియగు సూరన్న. 'రెండర్థంబుల పద్యమొక్కటియు నిర్మింపంగ శక్యంబుగా, కుండుం దద్గతిఁ గావ్యమెల్ల నగునే నోహో! యనం జేయదే?" (రాఘు. పీ. ౧౦) అని ధైర్యముగా మనలను ప్రశ్నించును. చేయదని చెప్పఁగల ధీరుఁ డెవఁడున్నాఁడు? ఒకమాఱు గాదు పదిమాఱులు 'ఓహో' యన్నను మన యద్భుతము దీఱదు.

పై వివరించిన భావము, వస్తువు, రచన యను మూఁడు కళాప్రకృతులలో, మనకవుల కాదర్శభూతమగు సంస్కృత సాహి

త్యపు పరిణామములను పరీక్షించితిమేని, మొదలు భావము, ఆపై వస్తువు, తరువాత రచనయు క్రమముగా ప్రాధాన్యమును వహించి చదువరుల నాకర్షించినవని స్పష్టపడును. వేదములందు, పురాణము లందు ఉన్నంత భావతీవ్రత తరువాతి కావ్యములందు లేదు. ఆది కావ్యమనఁబడు రామాయణమందే వివిధవస్తువులను విరివిగా చిత్రించుటయందు కవికిఁగల యాశ తెల్లముగఁ గానవచ్చును. కవిశిరోమణియగు కాళిదాసునందును ఇది లేకపోలేదు. కాని ఏడవశతాబ్ది లోని బాణభట్టు కాలమునకు ఈ వస్తుకళయందాశయు, గౌరవమును ప్రబలించెను. ఏవిషయమును జెప్పినను అందలి యంగోపాంగములను వివరించి ప్రత్యేకముగా మనయెదుటఁ బెట్టుట అతని గొప్పసామర్థ్యము. ఇదియే "బాణోచ్ఛిష్టం జగత్త్రయమ్" అను కీర్తి నతనికిఁ దెచ్చినది. పది, పదునొకండవ శతకములనాఁటి కవులలో ఆ వస్తుకళయు చాలవర కంతరించి రచనపై దృష్టి ప్రబలినది. శబ్దార్థముల చిత్రరచనలు పుంఖానుపుంఖములుగా, శాఖోపశాఖలుగా అల్లుకొన్నవి. క్రమముగా రచనలోఁగూడ అర్థమున కన్న శబ్దము ఎక్కువ ప్రాముఖ్యమువహించి నిలిచినది. సరసత్వమున కంటె చమత్కారమే యెక్కువ సాహిత్యధర్మముగా మాఱినది.

ఇది యొక విధముగా సహజమైన పరిణామమే యనవచ్చును. సాహిత్యము మనుష్యుల జీవితమునకు ప్రతిబింబము. మనుష్య జీవితమందే కాలక్రమమున భావములు వస్తువులకును, వస్తువులు రచనకును జోటిచ్చి తాము వెనుకఁబడినవి. కేవల ప్రాచీన మనుష్యజాతిలో కోపమువచ్చినప్పుడు కుత్తుకలు గోయుట, కామము పొంగినప్పుడు కన్నవారి నెత్తుకొనిపోయి పెండ్లాడుట, సంతోషము మిక్కుటమైనప్పుడు గంతులువేసి నాట్యమాడుట మొదలగు నుద్రేక ధర్మములు మిక్కుటముగా నుండెను. అటువంటి భావస్వాతంత్ర్యముచేత సంఘమునకు, తన్మూలమున వ్యక్తికిఁ గలుగు కష్టనష్టములను గమనించి తరువాతివారు కొన్ని కట్టుదిట్టముల నేర్పఱచుకొని భావప్రవాహముల నరికట్టిరి. కాని నరములలో పొంగి వచ్చుచున్న శక్తిప్రవాహమునకు, వేఱుచోటు చూపకున్న నది నిలుచునా? కావున వేయిచేతుల బాణాసురునకువలె తమ్ము

కును గలిగిన 'చేతులతీట' పోఁగొట్టుకొనుటకై, మనుష్యులు భావ ప్రపంచమునుండి వస్తుప్రపంచమునకు దిగి, ఇండ్లు, పట్టణములు, రాజ్యములు, విద్యలు, కళలు మొదలగు వివిధపదార్థ నిర్మాణమునకు లోఁబడినారు. మనలో ఇంకను 'నాగరకత' ముదిరి, భావములు ఎండి, వస్తునిర్మాణమునకుఁ గావలసిన సరకులుగాని, సామర్థ్యము గాని లేనివారు వట్టివేషము, ఆడంబరము, పటాటోపము మొదలగు వాని నాశ్రయించి సంతోషింతురు. ఈ న్యాయము మనుష్యజాతి యందేకాక వ్యక్తియందును గానవచ్చును. చిన్నతనమునందు కామక్రోధాదిభావములు స్వతంత్రముగా నుండును. యౌవనము నిండియున్నప్పుడు పేరు, ప్రతిష్ఠ, ద్రవ్యము, చదువు మొదలగు వస్తుసంగ్రహముపై ప్రయత్నము నడచును. ప్రాయము ముగియు కాలమున నరపమీసములకు వన్నె వేసికొనుట, శ్రద్ధతో అంగీ రుమాళ్ళు మొదలగునవి ధరించి దేహమందలి దౌర్బల్యదోషమును గప్పుకొనుట, చేతనైనవారికి గంభీరోపదేశములుచేసి పనిచేయించి తాను నాయకుఁడుగాఁ గానవచ్చి బిరుదములు, కీర్తిసంపాదించుట మొదలగు బైటిచక్కఁదనములు పెరుఁగును. ఈ దశాత్రయమే మనము తయారుచేసిన సాహిత్యమందును ప్రతిబింబించినది. ఇంచు మించుగా అన్ని సాహిత్యములందును ఇట్లు అంతరంగమునుండి బహిరంగమునకు జాఱుట మనము గమనింపవచ్చును.

ఈ మూఁడుదశలకు పైఁబడి నాలుగవదశ యొక్కటికలదు. అది వృద్ధత్వము. అప్పుడు మనుష్యవ్యక్తి వస్తువులందును, అంత కంటె వేషాడంబరములందును ఆశయు నభిమానమును తగ్గించుకొని మరల భావప్రపంచమున కెక్కును. ముదిమియందు కోపము, దుఃఖము, భక్తి, ప్రేమ మొదలగు భావములకు ప్రాబల్యమెక్కువ. కావుననే దానిని రెండవబాల్యమని పిలుతురు. మనుష్యజాతిలోఁ గూడ కేవల వస్తునిర్మాణమును, వేషమును తగ్గించుకొని భావ ప్రధానమైన స్వతంత్రపుబ్రదుకు బ్రదుకుటకై యిప్పుడు ప్రయత్నములు జరుగుచున్నవి. ఎల్లసాహిత్యములందును అదే మనోధర్మము ప్రతిఫలమై పనిచేయుచున్నది. అది యట్లుండనిండు.

సంస్కృతవాఙ్మయము నాధారముగాఁగొని తెలుఁగున వ్రాయఁబూనిన పండితకవులకు ఆకాలమున—అనఁగా పదు నొకొండవ శతాబ్దమునకు కొంత వెనుక ముందుగా—అందలి భావ వస్తు రచనాపద్ధతులు మూఁడును ఎదుటనుండినవి. అందును మొదటిదానికన్న రెండవది, దానికన్న మూఁడవది ఎక్కువ వ్యాప్తిలో నుండెను. కాఁబట్టి, ఇంగ్లీషు సాహిత్యములోని ప్రాచీనపద్ధతులను వదలి కేవలాధునిక మార్గములను ఏకాయెకిగా నేఁడు మనము ఎరవు తెచ్చుకొనుచున్నట్లు, ఆకాలమందును తెలుఁగుకవులు భావ వస్తువులు రెండును ఉదాసీనముచేసి రచనా కళకే చేయివేయు సంభవముండెను. కాని, జైనులను పాఱఁదోలి వైదికమార్గమును ప్రచారమునకుఁ దెచ్చుపనిలో నుండుటచే పూర్వకాలపు తెలుఁగుకవు లనేకులు పురాణములకు ముఖ్యముగా మొదలు చేయివేసిరి. కావుననే వారిలో భావకళ వృద్ధికి వచ్చినది. కాని నిదానముగాఁ బరీక్షించితిమేని వస్తు రచనలు రెంటియందును వారి కభిమానమును, చాపల్యమును పూర్తిగా లేకపోలేదని స్పష్ట పడును. నన్నయ, తిక్కన, మొదలగువా రపురూపముగాఁ జేసిన పురవర్ణనాదులయందు వస్తువిస్తరము, అనుప్రాసాదులును అందందు కానవచ్చి సంస్కృతకావ్యములవాసన తెల్లమగును. కాని మొత్తముమీఁద వారు ఎక్కువగా భావములకు లోఁగి తక్కిన రెంటికిని దప్పించుకొన్నారనుట నిర్వివాదము. కొంతవఱకు నన్నిచోడుఁడు ఆకాలమున శుద్ధకావ్యమార్గము నాశ్రయించినవారిలో మొదటివాఁ డనవచ్చును. అతనియందును భావకళకంటె వస్తుకళ మించినదే కాని రచన—అందును శబ్దరచన—ముందుకు రాలేదు.

నాచన సోమనాథుఁడు సంస్కృతవాఙ్మయమున గొప్ప పండితుఁడగుటచే అందలి ప్రాచీనమైన భావపద్ధతిని వదలి వస్తు పద్ధతిని—అంతకన్న నవీనమగు శబ్దార్థరచనాపద్ధతిని—తెలుఁగు భాషలో ఎక్కువప్రచారమునకుఁ దేఁ బ్రయత్నించి తరువాతివారికి మార్గదర్శకుఁ డయ్యెను! ఇదే యితని 'నవీనగుణసనాథ' బిరుదము నకు మూలము. కాఁబట్టి కన్నులలో నీరునించి, మేను గగుర్పఱిచి, హృదయము నల్లలనాడించు భావములకై ఆశించి సోముని నాశ్ర

యించిన లాభము లేదు. ఆపని కతఁ డెక్కువ ప్రయత్నించినవాఁడు గాఁడు. తిక్కన సోమయాజివంటి భావకళాబ్రహ్మను గురువుగా భావించి, యతని దేవతయగు శ్రీహరిహరనాథునికే తన గ్రంథము నంకితముచేసి, ప్రత్యాశ్వాసాంతమందును ఆ మహనీయుని పేరు చెప్పి తనపేరు చెప్పుకొను భక్తుఁడు సోముఁడు, భావకళకే ప్రయత్నించి యుండెనేని ఆగురువునంతటి శిష్యుఁడే యైయుండియుండునని యూహింప నవకాశము కొంత యందందుఁ గలదు. చూడుఁడు: హంసుఁడు డిభకుఁడు అను నిద్దఱన్నదమ్ములు దుర్వాసుని నవమానింపగా నతఁడు తపస్సు నశించునను భయముచే వారిని శపింపక— ఇది దుర్వాసుని జీవితచరిత్రలో నపురూపమైన విషయము— శ్రీకృష్ణునియొద్దకు పోయి దూరుచెప్పి, వారు పాడుచేసిన కమండలువు మొదలగు పదార్థములు చూపి తన యక్కసును వెడలగ్రక్కుట వినుఁడు:

సీ. ఈ కమండలుపంక్తి నెటుచూతు నిట్లు త
త్పాప మస్తంబులు పగులకున్న;
ఈ దండనివహంబు నెటుచూతు నిట్లు త
ద్ధూర్తహస్తంబులు తునియకున్న;
ఈ వల్కలవ్రాత మెటుచూతు నిట్లు తత్క
పట చర్మంబులు గాలకున్న;
ఈ శిక్యసముదాయ మెటుచూతు నిట్లు త
ద్ద్వేషణాంత్రంబులు ద్రెవ్వకున్న;
అకట! మోమోటలేక తా రంతచేసి
బ్రతికిపోయిరె! పులి పేదవడినఁ బసుల
వాఁడె లెక్కాడె ననుకత వచ్చె నాకు;
మునులలోపల నాలుక ముల్లు విఱిగె.

(ఉ. హ. ౮-౧౦౨)

తరువాత శ్రీకృష్ణుఁడు హంసుని జంపి యమునమడుఁగులో ద్రొక్కివైచెను. దానికి వానితమ్ముని యేడ్పు:

సీ. నాయెల్లినీడన నరలోక మేలుదు
నను లావు వఱదపా లయ్యెనన్న ;
దేవేంద్రునకునైనఁ దేఱి చూడఁగరాని
గారవోన్నతి నీటఁ గలిసెనన్న ;
పార్వతీపతిచేతఁ బడసిన దివ్యాస్త్ర
భూరిసంపద వెల్లిఁబోయెనన్న ;
వలరాజునకునైన వర్ణింపఁగాఁ దగు
తనువిలాసం బేటు గొనియెనన్న ;
అన్న నీయట్టియన్న న న్ననుదినంబు
గారవింపఁగనుండ నేఁకరదునన్న ;
ఇంకఁజాల నెవ్వగలచే నిచట నిలువ
నాకు నేల నీతోడిదే లోకమన్న !

(ఉ. హ. ౪-౩౦౦)

నిర్భాగ్యుఁడైన యా యనుఁగుఁదమ్ముఁడు ఆ దుఃఖము చేతనే బలవంతముగా మరణముఁ దెచ్చుకొనియెను. వారి శోచనీయమైన కడపటి యవస్థ యిది :

క. వ్రేలెడు వెంద్రుక లిరుగడఁ
దూలఁగఁ దలయూఁచుఁ; దొప్పఁ దొప్పన నోరున్
గేల నడిచికొను ; సెలవుల
లాలలు దొరుఁగంగ 'నన్నలా!' యని యొఱలున్.

క. తాలం దల యడిచికొనున్ ;
నేలంబడి పొరలు ; లేచు ; నెత్తురు లుమియున్
గేలిఁబడి రిపులు చూడఁగ
నాలుక వెలికికొను ; జావునకుఁ దన్నికొనున్

(ఉ. హ. ౪-౩౦౨, 303)

కాని సోముని హరివంశములో నిట్టి సన్నివేశములు చాల అరుదు. పై పద్యములందును అతఁ డాశ్రయించిన వస్తు రచనా కళల వాసన పూర్తిగా లేకపో లేదని మనము గమనింప

వచ్చును. కాఁబట్టియే సోముని కవిత్వమున వర్ణనల యౌచిత్యము, సన్నివేశముల పరస్పర సంబంధము, మాటల యానుపూర్వ్యము— ఇత్యాది భావకళాంగములఁగూర్చి చర్చించి ఫలము లేదు.

భావములతో నెక్కువ సంబంధము లేకున్నను ఇతఁడు వర్ణించు వస్తువులు చాల సత్యము లనిపించి తృప్తి సేయఁగలవు. పదార్థములకుఁ జేరిన యంగములలో నొకటి రెండు మాత్ర మేరుకొనక అవి సర్వాంగములతో మనహృదయమునందు ముద్రపడునట్లు చెప్పు సామర్థ్య మితనిది. ఈ పిశాచముల వర్ణన చూడుఁడు :

సీ. వికృతాననంబులు విరళదంతంబులు
నిడుపైన దౌడలు నిక్కు మెడలు,
ముడివడ్డబొమలును ముమ్మూలముక్కులు
బల్లవెంట్రుకలును బరికెతలలు,
బొక్కిఱొమ్ములు లోఁతుఁ బొట్టలు మిడిగ్రుడ్లు
గూనివీపులు నిడుఁగ్రొంకి వ్రేళ్ళు
బూరకాళులు నీచఁబోయిన చేతులుఁ
గోలమూఁపులు గుదిగొన్న తొడలు
నతిభయంకరగతి సూపు నట్టహాస
కహకహారావములతోడఁ గాననయ్యె
దావపావకఘనశిఖాదగ్ధతాల
సాలసంకాశమగు పిశాచద్వయంబు.

(ఉ. హ. ౨-౧౨౨)

ఇట్లే కోట లగ్గపట్టుట, గదాయుద్ధము, జూదము మొదలగు వానిని వర్ణించునపు డందలి సర్వాంగములను సాధ్యమైనంతవఱకు వివరించి చూపును. ఈ వస్తుకళయందలి యభిమానముచేత నే ఒక్కొక్కమాఱు వట్టి పేళ్ళను మాలికగాఁ గూర్చి వదలిపెట్టును. ఎట్టిన వ్రాసిన మహర్షుల పేళ్ళమాలిక మీరు వింటిరి. సీసపద్యము నుపక్రమించి యతఁడు తుదివఱకు ఒక సమాసముగా దానిని నిర్వహింపలేక కొనలో తేపలు వేసినాఁడు. 'చప్పన్నారు' దేశములు మన భరతఖండమందుఁ గలవని విన్నాముకాని వాని పేళ్ళన్నియు

మన మెఱుఁగము గదా. సోముఁడు వానికిఁ దోఁడు మఱొక్కటియుఁ జేర్చి యేఁబదియేడు దేశములపేళ్ళు కూర్చి యొక్క సీసమంతయు ఏకసమాసముగాఁ జేర్చినాఁడు :

సీ. పాంచాల పాండ్య బర్బర కిరాతాభీర
కురు విదేహ విదర్భ కుకుర గౌళ
గాంధార మగధ కొంకణ కళింద పుళింద
సింధు సౌవీరాంధ్ర చేది చోళ
సాముద్ర సాల్వ కోసల కళింగ కుళింగ
వత్స సౌరాష్ట్రాంగ వంగ మత్స్య
సూరసేన సుదేష్ణ సుహ్మ కాశ కరూశ
లాట కర్నాట మాళవ వరాట
కుంతలావంతి ఘూర్జర కుహ్మక త్రి
గర్త బహుధాన యవన కేంకణ దశార్ణ
పుండ్ర బాహ్లిక ద్రవిడ కాంభోజ హూణ
కేకయ వసాతి కాశ్మీర కేరళములు.

(ఉ. హ. ౫-౧౨౨)

ఒకటే గుక్కగా, ఛందోనియమములఁ దప్పక, నడుమ నడుమ అనుప్రాసమును నిర్వహించిన యీకూర్పున కాశ్చర్యపడక యుండ గలమా ?

ఒక పూర్ణవస్తువునకు సంబంధించిన యవాంతరవిషయము లనేకము లేర్చి కూర్చుట వస్తుకళ యంటిమిగదా. దానియందలి యభిమానపువాసన సోమనాథుని శబ్దార్థ రచనాకళయందును వ్యాపించినది. అనఁగా ఏదేని యొక భావమును వెలువఱుచుటకై అర్థమును గల్పింపవలసినప్పుడు దాని నెన్నివిధముల సాధ్యమో అన్నివిధములఁ గల్పించుట, ఆయర్థమును దెలుపుట కెన్ని పదము లుపయోగింపఁగలడో యన్నియు నుపయోగించుట, ఈ రెండును సోముని రచనయందుఁ గలవు. ప్రాచీను లిట్టివి వ్రాయకపోలేదు. అదే పద్ధతినే సోముఁ డింకను విస్తరించి పనిచేయును. అర్జునుఁడు దేవదత్తశంఖము పూరింపఁగా ఆ భీషణధ్వనికి ప్రపంచమంతయు

కలగుండుపడెనను భయభావమును సూచించుటకై తిక్కన యీక్రింది పదార్థములను గూర్చెను:

మ. కలఁగెం దోయధిసప్తకంబు; గిరివ
ర్గంబెల్ల మాటాడె, సం
చలతంబొందె వసుంధరావలయ; మా
శాచక్రమల్లాడెఁ; గొం
దలమందెం ద్రిదశేంద్రు పట్టణము; పా
తాళంబు ఘూర్ణిల్లె; నా
కులమయ్యెన్ గ్రహ తారకాకులము; సం
క్షోభించె నవ్వేధయున్.

(భా. విరా. ౪-౧౭౨)

ఇదే భావమునే శ్రీకృష్ణుఁడు పాంచజన్యమును పూరించి నప్పుడు సోముఁడు వర్ణించుచు అలంకార సహాయ్యముతో మఱింత విస్తరించెను.

సీ. వడఁకుపన్నగరాజు పడగలమీఁద స
ర్వంసహాకాంత పేరణము సూప,
నట్టాఁతలూఁగెడు నుదయాస్తగిరులతో
నాకాశలక్ష్మి కోలాటమాడ,
దెరలెత్తి సప్తసాగరములుఁ బొరలంగ
వరుణుండు గొండిలి పరిఢవింప,
మొకములచాయ వేఱొక చందముగ నిల్చి
కమల సంభవుఁడు ప్రేంఘుణ మొనర్ప,
మంగలములోని ప్రేలాలమాడ్కిఁ జుక్క
లిక్కడక్కడ వడ, దిక్కులెనిమిదియును
బగులఁ, బాతాళతలము గొబ్బటిలఁ జెలఁగె
శౌరి పూరింప నప్పాంచజన్య రవము.

(ఉ. హ. ౪-౨౧౬)

ఇంకొకటి యుదాహరించినచో సోముని యర్థరచనమందు ప్రాచీనులకంటె నధికముగాఁగల విస్తరము ఇంకను స్పష్టమగును.

ఇందుకై నా విస్తరమును మన్నింపుఁడు. భారతములో పాండవులడవికిఁ బోవునప్పుడు కుంతి సహదేవుని చిన్నతనమును, ముగ్ధత్వమును దలఁచుకొని ద్రౌపదితో నిట్లు పల్కెనఁట:

చ. కడుఁబసిబిడ్డ; వీఁ డొకటి
  కా దవునా నెఱుఁగండు; ముంద తె
య్యెడ నొకపా టెఱుంగఁ; డెవ
  యెంతయుఁ గోమల; మెప్పుడైన నేఁ
గుడువఁగఁ బిల్తుఁగాని తన
  కుంగల యాఁకటిప్రొద్దెఱుంగఁ; డీ
కొడు కిటు పోకకున్ మనము
  గుందెడు, నిన్ గని యూఱడిల్లెడున్.

(భా, వి. ౨-౨౧౩)

సోముని హరివంశములో ఉషాకన్యకొఱకై చిత్రరేఖ అనిరుద్ధు నెత్తుకొని పోఁగా యంతఃపురస్త్రీలు వాని మంచితనమును, మార్ధ్యమును దలఁచుకొని యెంతదీర్ఘముగా వాపోయిరో వినుఁడు:

సీ. చక్కనివారిలోఁ జక్కనివాఁడు, తాఁ
  గడుఁబిన్నగాని వేగంబువీడు;
బంటునొచ్చిన నోరఁ బలుకండు; నెఱవాది;
  సుఖభోగి; చుట్టాలసురభి; రాచ
బిడ్డయైయుండి గబ్బిదనం బెఱుంగఁడు
  గరగరనై యుండుఁ; గలయనేర్చు;
నూపరలాఁడుగాఁ; డుపకారి; నవ్వు మే
  లముగాని తనవారు లాఁతివా ర
నఁడు; గడాని బంగారు రత్నంపు బొమ్మ;
ముంగిటి నిధాన; మమ్మలముద్దు; దమ్మ
లన్న; యీతని గనదేని కన్నతల్లి
కడుపు మసిగాదె? దయ్యము కరుణలేదె?

(ఉ. హ. ౫-౨౭౮)

ఒక భావము తీవ్రముగా చదువరుల మనస్సులో నాటిం చుటకు ఒక్కయర్థము చాలదు; పెక్కులు కావలయును. మొదటినుండియు కవులందఱు గమనించిన కళారహస్యమే కాని, ప్రాచీనులలో భావమున కీయర్థరచన బంటు, తరువాతివారిలో అర్థరచనకు భావము బంటు. అర్థమునందువలె శబ్దమునందును సోముఁ డుపయోగించు వైవిధ్యమునకు ఈ క్రింది వచనపుఁ దునక మచ్చు :

"వ. ఇట్లు గదావిహారంబున హంస హలధరులు రుధిర ధారాసారంబునం దడిసి చెడక వారింపక యోసరిలక యోలం బుఁగొనక పంకింపక పాదుకొనక వడిసడలక శంకింపక సందీక సరకుఁ గొనక వెనుకమెట్టక వేగిరపడక చఱచిపోక చాలింపక చలింపక చాయదరుగక, గదలు సారించియు సైరించియుఁం జుట్టియుం బట్టియుఁ దట్టియుఁ గదల్చియు నదల్చియుఁ దాఁకించియు సోఁకించియుఁ బూఁచియుం జూచియు మోపియుం బాపియు జడిసియు నొడిసియు నెత్తియు నొత్తియుఁ దాఁచియుం ద్రోచియు..." ...ఇత్యాది
(ఉ. హ. ౪-౨౪౧)

ఇందు కదనము చేయువారి గదలకంటె కవిత్వము వ్రాయు వాని కలమునకు గౌరవ మెక్కువయని వేఱుగా తెలుపఁ బనిలేదు గదా.

పైని అర్థరచనకే సంబంధించిన వేఱొక 'నవీనత' సోముని యందుఁ గలదు. చెప్పవలసిన మాటలెల్ల సాధ్యమైనంతవఱ కేదో చమత్కారముగాఁ జెప్పుట. అనిరుద్ధుని వలచి విరహవేదనలో నున్న ఉషాకన్య చెలికత్తెతో 'ఒకప్రక్క సిగ్గు, ఇంకొకప్రక్క ఆశయు నన్ను బాధించుచున్నవి' అని చెప్పఁదలఁచుకొని "సిగ్గుఁ జిత్తముః వాదులు పెట్టుకొన్నయవి" అని చెప్పుచున్నది (ఉ. హ. ౫-౧౨౯). అదేమాటయే మార్చి వేఱొకచోట,

"తలఁపునకుఁ బక్కనుండెడు తలఁపు లేదు;
లజ్జఁబోఁద్రోవ లజ్జకు లజ్జలేదు"

(ఉ. హ. ౫-౧౧౭)

అని విసుగుకొనుటలోఁగూడ నొకవింత చూపినది! అని రుద్ధుని దెచ్చెదనమ్మా భయపడవలదని చిత్రరేఖ యూఱడించిన తరువాత ఆమె మనస్సులో తక్కిన చింతలన్నియు నశించి వలపు బలమయ్యెను. ఆ మాటకు సోముఁ డిచ్చిన నవీనత చూడుఁడు :

క. "లొల్లియగు వగల త్రొక్కిన
నిల్లిగ్గున గానవచ్చు హృదయములోనన్
మల్లామడియగు మదనుఁడు
మెల్లనఁ గూర్చుండెఁ దాల్మి మినుమినుకనగన్"
(ఉ. హ. ౫-౧౬౬)

ఈ క్రొత్తఁదనము సోముని శైలిలోని ముఖ్యగుణ మన వచ్చును.

ఈ రచనాకళకుఁ జేరినవే అర్థశబ్దాలంకారములని వేఱుగా చెప్పనక్కర లేదుగదా. అలంకారములలో ఉపమ, ఉత్ప్రేక్ష, రూపకము, లోకోక్తి మొదలగు కొన్ని నిజముగా కావ్యలక్ష్మికి సొగసుఁ గల్గించునవి. తక్కినవి శాస్త్రమునకై యేర్పడినవి. సోముఁడు ప్రాచీనులకంటె నలంకారములం దెక్కువ యభిమానము గలవాఁడు. ఇతడు వానిని వాడునపుడెల్ల ప్రాయికముగా మధుర ములై, సుకుమారములై, హృదయంగమములగు పదార్థములనే యేర్చి చిత్రించును. ఉపమాలంకారమున కాచార్యుఁ డనఁదగు కాళిదాసుగూడ నొకొక్కమాఱు,

"ధాతోః స్థాన ఇవా దేశం సుగ్రీవం సన్న్యవేశయత్"
(రఘు. ౧౨ సర్గ)

ఇటువంటి నిర్జీవములు, నీరసములునగు పదార్థముల నుపయో గించుట కలదు. శ్లేషసహాయముతో నతికించినప్పుడుతప్ప సోముని యుపమోత్ప్రేక్షాద్యలంకారములు అట్టివిగా నుండవు. నరకాసురుఁడు శ్రీకృష్ణుని ఫాలమున నాఁటునట్లు బాణము ప్రయోగింపఁగా నది,

"అరచందురు డెందములోఁ
జొరఁబాఱి వణంకు తోఁకచుక్కయపోలెన్"
(ఉ. హ. ౧-౧౫౩)

ఉండెనట! ఈశ్వరుని నీలకంఠము చుట్టునుగల తెల్లని సర్పహారము,

"ఇరుల బండారంపు టింటికిఁ బెట్టిన
బొందుమల్లెల కోటఁ బోరగెలిచి"

(ఉ. హ. ౨-౧౭౧)

యుండినది. ఉదయించిన బాలసూర్యబింబము,

"సీ. కుంకుమ హత్తించి కొనగోరఁదీర్చిన
పురుహూతు నిల్లాలి బొట్టనంగ

తొలిదిక్కుతొయ్యాలి చెలులపైఁ జల్లంగ
నిండముంచిన పైఁడికుండ యనఁగ"

(ఉ. హ. 3-౧౬)

'కన్నుల పండువయ్యె' నఁట. ఇవి చదువరుల మనసునకును పండుగలే యనుటలో సందేహమేమి?

అర్థాలంకారములలో నెల్ల సోమునికి లోకోక్తులందు చాల ప్రీతి. అవకాశము దొరకినప్పుడెల్ల నొకసామెతనుదెచ్చి తటాలున నతికించును.

శబ్దరచనలోఁగూడ నితఁడు పలుదెఱఁగుల పనితనమును జేసినాఁడు. అనుప్రాసములు, అంత్యప్రాసములు ఇతని కందుకొన్నట్లు చేతికిఁజిక్కును. ఒక్కొక్కమాఱు యమకము ఉన్నదున్నట్లుగావచ్చి చోటుచేసుకొనును, పద్యమందును, గద్యమందును జంటలు జంటలుగా ఏకనాదముగల పదములు ఎక్కడనుండియో వాలి గజ్జెల గంటల గొలుసులవలె నేర్పడి నడచును:

క. "ద్విరదంబులు నరదంబులు
హరులు నరులు నిక్కినిక్కి నలవున్ నెలవున్
బురుడున గరుడున కలుకలు
బెరయు నెరయ శౌరి సీరిఁ బిలుచున్ బెలుచన్"

(ఉ. హ. ౬-౫౧)

"వ......శరంబులు రాలినను శిరంబులు వంపక, కుంతంబులు పడినను పంతంబులు వదలక, ప్రాసంబులు వెడలినను రోసంబులు సడలక, గదలు తూలంగినను నెదలు సలింపక, శూలంబులుపోయినను నోలంబులు దలంపక, చాపంబులు విఱిగినను దాపంబులం బొరలక..."

(ఉ. హ. 3-౮౦)

ఉన్నదున్నట్లుగా శైలి సంస్కృతభాషామయమై ఉపక్రమము మొదలు ఉపసంహారమువఱకు ఒక్కటే సమాసముగా సాఁగును. అంతే ఆకస్మికముగా మరలిమెట్టులో తెరలు తెరలుగా అచ్చ తెలుఁగు పలుకులు పూచిన అవిసెచెట్టుమీఁదికి చిలుకలదండువలె వాలి తేనెలు చల్లును. సామాన్యముగ సంస్కృతపదములు తెలుఁగుపదములు అన్నదమ్ములవలె కలసిమెలసి అవిభక్తకుటుంబమై యొకధారగా ప్రవహించుచుండును.

శబ్దార్థరచనలు రెంటికిని జేరిన శ్లేషయం దితని కభిమాన మెక్కువగానే యున్నది. దానిని పద్యములకంటె గద్యములందే యెక్కువగా నితఁడు ప్రయోగించినాఁడు. కాని యావిద్యలో ఇతని చమత్కారము తక్కువ. తరువాతి యాంధ్రకవులు ఇతఁడు చూపినత్రోవలు హస్తముతోఁగూడ దిగమ్రింగినారు. దానిలో చాల నాజూకును, కౌశల్యమును నెఱపినారు. మఱియు పదునాఱవ శతకము నాఁటికి తెలుఁగులో స్థిరమైనాటుకొన్న 'చతుర్విధ కవితామతల్లిక'*లో శైలినిబట్టి సోముని కాశుకవిత్వ మలవడిన దని చెప్పవచ్చునుగాని, తక్కిన బంధ, గర్భ, చిత్రకవిత్వములు ఇతఁడు సాధించినట్లు తోఁచదు; ఒక నిరోష్ఠ్య పద్యము మాత్రము నడుమ నెట్లో సందుచేసుకొని దూరినది:

" చ. చని చని కాంచె నంత ఋషి
సంహతి సారస కేసరాంతరా
సన సరసాళిసంగఁ దట
చందనశాఖి చలత్తరంగఁ గాం

* చూ: అల్లసాని పెద్దన గద్యము.

చన సరసీజలార్ద్రి యతి
సంచిత సైకతలింగ గంగ నం
జనగిరి గాఢ గంధగజ
సంగత శృంగ రథాంగ నత్తతిన్ ”
(ఉ. ౧-౧౦౬)

ఇందు ఓష్ఠ్యవర్ణములలో శుద్ధములగు ప, ఫ, బ, భ, మ లు మాత్రమే కాక మిశ్రములగు వ, ఉ, ఊ, ఒ, ఓ, ఔ అను అక్షరములుఁగూడ వదలఁబడినవి! ఇట్లు నిరోష్ఠ్యముగా కావ్యములనే పూర్తిగా వ్రాయఁబూనిన తరువాతివారు ఈ నియమము నిర్వహింపలేక హల్లులకుమాత్ర మానియమ ముంచుకొని అచ్చులకు వదలి పనిచులకఁ జేసికొనిరి. సోమనాథుని గ్రంథము మనకు పూర్తిగా లభింపలేదనియే నమ్మవలసియున్నది గావున లభింపని భాగములో నితఁ డిట్టిరచన లెక్కువచేసియుండునేమోయని యూహింపవలసి యున్నది.

ఇట్లు నాయభిప్రాయమున నాచన సోమునిది భావముల ప్రాధాన్యము లేక వస్తువు, రచన వీనికిఁ జేరిన కళ. ఆ కాలమున తెలుఁగుసాహిత్యమున కిది నవీనము. ‘అవిదిత వేద్యాంతర’ మైన యానందము నిచ్చుశక్తి లేకున్నను తృప్తిని, ఆశ్చర్యమును గలిగించి మనల నుల్లాసపఱచు సామర్థ్యము దీనికిఁ గలదు. ఇది మనుష్యు లభినయించు నాటకముగాదు; ప్రూనిబొమ్మలయాట. దీనిలో పాత్రములు వెలువఱచు భావములకన్న వాని యలంకారములు, వన్నెలు, ఆడించువాని హస్తలాఘవము మనల నెక్కువగా నాకర్షించును. కన్నతల్లియో, చేయిపట్టిన ప్రియకాంతయో చేతులార మన యాకలి దీర్చవలయునని, మన కారోగ్యమును, పుష్టియు గలుగవలయునని యాశతో మనఃపూర్వకముగ మన కోరినంత వడ్డింపగా భుజించు ఇంటి భోజనము వంటిదిగాదు; చిత్రములైన బల్లలు, పలువన్నెల పూవులు, వింత వింతరకముల గాజు పళ్ళెములు, పాత్రలుఁ గలిగి, క్రొత్తక్రొత్త పేరులు, రుచులుఁ గల వంటలతో ఇంటి యాలుబిడ్డలనుగూడ మఱపించు ‘హోటలు’

ఫలహారమువంటిది. ఇంకను మనసు మఱపించి కనులు మూయించు బిగికౌఁగిలింతవంటిది గాదు ; నిలువనీయక నవ్వించి నాట్యమాడించు చక్కలిగింతవంటిది.

దీనికి లోఁగనివాఁడు లేడు కాని నిదానముగా యోజించి నప్పుడు ఇంతకంటె మంచికళ కలదని తలఁచనివాఁడును లేడు.

# నిగమశర్మ అక్క *

## ౪

ఈ చల్లనితల్లి పేరేమో తెనాలి రామకృష్ణకవి మనకుఁ దెలుపలేదు. అతనికే తెలియదేమో. వాల్మీకి అగస్త్యునికి పేరు లేని యన్న నొకనిని సృజించెను. అతనికి పేరొక్కటే కాదు, మఱేదియు లేదు. ఈయమ సృష్టి యట్టిదికాదు. రామకృష్ణుఁ డమృతములో లేఖిని నద్ది దిద్ది తీర్చి యాడించిన పుత్తడిబొమ్మ యిది. కావున పేరు లేకున్న నేమి? నిగమశర్మవంటి పెద్దపేరే 'నేతిబీరకాయ' కాలేదా? తెనాలివాని నిర్మాణములలో పేరు పెంపు గల యేయితర వ్యక్తికిని ఈ యనామధేయకుఁగల జీవకళలో, నయనాణ్యములలో పదింట నొకపాలును లేదు.

ఎవఁడో యొక చిత్రకారుని వేళాకోళము చేయుటకై తాను చిత్రింపఁగలఁడని చెప్పి, గోడనిండ తోఁకలు వ్రాసి గుఱ్ఱము లాప్రక్కనున్నవని చెప్పి రాయలవారిని నవ్వించినవాఁ డఁట రామకృష్ణుఁడు! వాని కవిత్వమందేమో యీ ధర్మము చాలఁ గానవచ్చును. అంగసృష్టి అంగిసృష్టికన్న ఎక్కువ. కాని యీయంగములే, ప్రాతఃకాలమున ప్రాకారముమీఁద నిక్కి చూచు లేఁడిగల కొనలవలె, ప్రాణశక్తితో తకతకలాడుచుండును. సంపూర్ణ వస్తునిర్మాణమునకు అతనియందు లేనిది నేర్పుగాదు, ఓర్పు. వేళాకోళపుఁ గందువలను, పరిహాసపు పట్టులను వెదకుట యతని స్వభావము గావున ఒకవస్తువు నాద్యంతపుష్టిగా పరీక్షించు లోపల చూపు వేరొకచోటికి పారును. మొదటిదానియెడ శ్రద్ధ తగ్గును. పరిహాసకుశలత, తెలివి, చురుకుదనమునకు గుర్తు. అది గలచోట సామాన్యముగ సోమరితనమును, అశ్రద్ధయు నుండును. కథలలోని కొంటెభాగవతపు రామకృష్ణుఁడే కావ్యములందును కొంచెము నాగరకవేషపు నాజూకులతో ప్రతిఫలించుచున్నాఁడనుట

* తెనాలి రామకృష్ణుని పాండురంగ మాహాత్మ్యము. 3 ఆ.

రసికులందఱును గమనించిన విషయమే. ఇతని రచనలలోని మాటల పోటు, నిర్లక్ష్యపునడక, భావముల తీండ్ర — అన్నియు దాని పరిణామములే. కాని కొంత శ్రద్ధవహించి పసచేసెనా ప్రతిమయంగములు, అంగాంగములును కళకళలాడునట్లు నిలుపక పట్టిప్రదర్శించు అపూర్వ సూత్రధారవిద్య ఇతనికిఁ గలదనుట కీ పేరులేని పేరంటాలే శాశ్వతసాక్షి.

ఈమె తండ్రి సభాపతి. పేరుకుఁ దగినట్లు 'వేదముల్ వోసిన గాదె, శాస్త్రములు పుట్టిన యిల్లు, కళాకలాపముల్ డాసిన రచ్చ.' పీఠికాపుర సంస్థానమున పేరెన్నికగన్న వైదికాచార్యుఁడు. ఆగర్భ శ్రీమంతుఁడు. రాజాధిరాజుల మ్రొక్కులు గొన్నవాడు. ఆహితాగ్ని. ఇంటిలో ముప్పొద్దు భగవదారాధన, అతిథుల సమారాధన, శిష్యుల వేదములసంత, శాస్త్రముల చదువు, వీనికిఁ దోడు వడ్డీవ్యాపారము, కుడివారము మేలువారము రెండునుగల సేద్యము, దానికి వలయు పశు శిశు దాస దాసీజనములు, 'రాజాలయమునకు రాకపోకలు'— వీనితో తీరికగలిగినప్పుడు 'అంగడి'కిఁ బోయి గ్రామకార్యము దీర్పవలసిన ధర్మాధికారము. ఇట్లితఁడు వైదిక లౌకికములు రెంటిని సమానముగా కలిపి మెదిపి కరుపుపోసిన దొడ్డ విగ్రహము. చదువు, చనవు, పరువు— మూఁడును సంపాదించిన మూర్తి.

తల్లి 'అతులనిష్ఠ' గల ముసలిముత్తైదువ. అత్తగారవసాన కాలమున నిచ్చిన హారి సుదర్శనపుఁ బేరు అమూల్యపవిత్రాభరణముగా నెంచి పండుగవేళలఁ బెట్టుకొని తీసి దాఁచుచు, తరతరములనుండి కూడఁబెట్టఁగా వచ్చిన 'మూలవిత్తము' రహస్యమును బైలుపడనీక భద్రముగాఁ గాపాడుచు, వయసు ముదిరినను గొడ్డువోక బిడ్డలను కడుపునిండఁ గనుచు, ధర్మార్థములు రెంటిని సమానముగా సంసారమందు నిర్వహింపగల్గిన పెద్ద యిల్లాలు.

ఇట్టి తలిదండ్రుల కడుపునఁబుట్టి పెరిగిన పెద్దకూఁతురు మన కథానాయిక. కులాభిమానము, ధర్మార్థములందలి జాగ్రత్త, తెలివితేటలు, పలుకుల నయగారము, శీలనైర్మల్యము, పనిపాటలందలి దిట్టతనము, తీవ్రమైన ప్రయోజనదృష్టి — ఇవన్నియు నామెకు చిన్న

నాఁటినుండి చెప్పక చూపక వచ్చిన చిట్టలు. వ్రాఁత చదువుల సమాచారము తెలియరాదు. ప్రాయశః ఆమె వానిని నేర్వలేదు. నష్టమును అంతగాలేదు. అత్తవారిల్లు పుట్టినింటి కైదామడల దూరము. ఈ సంసారముతో వియ్యమందిన యా సంసారపు పెద్దతనమెట్టిదో మనము కొంత యూహింపఁగలము. తమకంటె గొప్పవారింటికే యాఁడబిడ్డ నిచ్చుట కందఱును ప్రయత్నింతురు. ఇఁక భర్త? — అతఁడు రామకృష్ణకవి పెద్ద కుంచెనద్ది గోడపైఁ దీఁడి చిత్రించిన తోఁకలలో నొకటి. భార్యచేతితోఁ దాఁకినచోఁ గదలును. అంతే. ఇరువురికిని 'ఇంతలు అంతలు నగు సంతానము' సమృద్ధి.

తనయింటఁ దాను మర్యాదగా సంసారము చేసికొనుచున్న యామెకు పుట్టినింటినుండి వార్త యొకటి వచ్చి చాల మనసు నొప్పించినది. తమ్ముఁడు నిగమశర్మ పచ్చిపోకిరి యైపోయినాఁడు. ఆస్తియెల్ల నించుమించుగా కరఁగఁ దిన్నాఁడు. ఆచార వ్యవహారము లడుగంటినవి. మానమర్యాదలు, చదువుసంతలు నశింప వచ్చినవి. అభక్ష్యభక్షణము, అపేయపానము, అప్పులు, జూదము, మోసము, దొంగతికము మొదలగువానికి లోఁగి కడపటిలోఁతునకు దిగినాఁడు. కంచెంత కాఁపురము. తలిదండ్రులు ముదుకలు. దిక్కు విచారించు వారు లేరు.

ఇంటి పెద్దకూఁతురు తాను. నిగముఁడు తానెత్తి ముద్దాడి పెంచి పెద్దచేసిన తమ్ముఁగుఱ్ఱ. వానికి బుద్ధిచెప్పి త్రోవకుఁ దేలేనా యనుకొన్నది. మగనిని బిడ్డలను గట్టుకొని యొకనాఁడు బయలుదేఱి పుట్టినింటికి వచ్చినది.

ఇంటిలోఁ జూడగా అన్నియు నన్నిత్రోవలై చెడి చెటాకులఁ గలసినవి. 'సన్నాహము' అను జీవధర్మమే లేదు. ఎవరును ఏపనికిని పూనుకొనువారు గానరారైరి. తలిదండ్రులు చెఱియొక మూల ప్రాణావశిష్టులై వగల మునిఁగి సుడివడియున్నారు. పెరుమాళ్ళ యింటిలో బూజు నిండినది. పాత్రలు ప్రాఁచిపట్టినవి. పెద్దయిల్లు చూచి మధ్యాహ్నమునకు వచ్చునతిథులు మాటాడించువారులేక వేఱుగృహముల వెదకఁబోవుచున్నారు. చిన్నపిల్లలు వేళకన్నము,

నీరు విచారించువారు లేక మాసి నలఁగినాడు. పాడియావులు బందెల దొడ్లకో, బైటి తెరువులకో పాలయినవి. పనివారు మొగముఁ జూపుట యరుదైనది. వారి జీతబత్తెము లరయువారు పుస్తకభాండాగారములోని తాటాకుల గ్రంథములు కొన్ని-దీపారాధనయందలి యసడ్డచేఁ గాఁబోలు-నిప్పపాలైనవి. కొన్ని దుమ్ముదిని త్రాళ్ళు ద్రెగి చెల్లాచెదరైనవి కొన్నిటిని ఎరవుతీసికొని పోయినవారు నిగమశర్మపుణ్యాన మాకే దక్కెనని తామే యుంచుకొన్నారు. శిష్యుల పాఠప్రవచనములమాట చెప్పనే పనిలేదు. మడి, మట్ర, చేను, చెట్టు-మొదలగునవియెల్ల చేయివేసినవారి సొత్తులైనవి ఇన్ని యనర్థములకు మూలకారణము తన్ముఁ డింటిలో లేఁడు. ఎక్కడనున్నాఁడో, ఎప్పుడు వచ్చునో, రానేరాఁడో, తెల్పువారు లేరు.

ఇట్టి సన్నివేశమునఁ గాలుపెట్టి యా మగనాలు తానును ఏడ్చువారిజతలో కన్నీరు గార్చుచు నెదచెడి కూర్చుండలేదు. తాను ధైర్యముతో నిలఁబడి యిరువది చేతులఁ బనిచేసి యిరువది కాళ్ళతోఁ దిరుగకున్న ఈ యింటికి ముక్తి లేదని యెఱిఁగెను. కాని వచ్చిన వెంటనే సవరించు ప్రయత్నములు చేయలేదు. ఆత్రపుదోష మామె యెఱుఁగును. కావున మౌనముతో 'కొన్ని దినములు గడపినది.' ఏల? సన్నివేశము వెనుకముందులు కలయఁజూచుటకు, కళ్ళెపుఁ ద్రాళ్ళన్నియు బిగువుగాఁ జేతులఁ బట్టుకొనుటకు, తా నెంతైనను పొరుగూరిదిగదా! ఆఁడుబిడ్డగదా! ఇంత పెద్దసంసారము చెడినది చక్కఁబెట్టవలయునన్నచో తటాలున తనమాట లెవరు విందురు? ఈ తీర్పునకు నేర్పును, ఓర్పును గావలయును. కావుననే మొగము సింద్రించుకొని వారిని వీరిని గసరి తిట్టక, యుపదేశముల, ఉపన్యాసముల గోడవకుఁబోక, మొట్టమొదలు మూలస్తంభములవంటి ముసలి తలిదండ్రులను దేర్పవలయునని తలఁచినది. 'తీండ్రగల వచనరచనా చమత్కారంబులు' ప్రయోగించి వారివంత కొంత దొలఁగించి మొగముల దెలివి గలిగించినది. వారికి వలయు నుపచారములెల్లఁ దానే చేసినది. 'భగవదారాధనకు వలయు నేర్పాటులు చేసి జరిపించినది.' తొంగిచూచి పోఁబోవు నతిథులను దయచేయుఁడని పిలిచి

యాదరించి యుపచరించినది. తల్లిని రహస్యముగా నడిగి తమ్ముని చేతికిఁ దప్పిన ఖూరాలధనమున్న చోటు తెలిసికొని మఱింత భద్రపఱిచి నది. నయ భయములచేతను, కలియఁగలపు మాటలచేతను పిల్లలను, పనివాండ్రను లోఁగఁజేసికొన్నది. పసులకొట్టును జక్కఁబెట్టి పాడి వెలయించినది. భర్తను బిలిచి పుస్తకముల భాండాగారమునఁ గూర్చుండఁబెట్టి వాని దుమ్ము దులిపించి, కట్టించి, ఎరవుపోయిన చోటులు దెలిసికొని పంపి బదనామి చేయించి తెప్పించి నిలువరించి నది. శిష్యులు మరలవచ్చి చదువు సంతలు జరుపుకొనుసట్లు ప్రోత్స హించినది. పైరుపంటలు రైతులపాలు గాసీక తనకొడుకుల నప్పుడప్పుడు పంపి యుస్తువారీ చేయించి స్వాములున్నారనిపించి హద్దుకుఁ దెచ్చినది. మొఱుఁగుఁదీగవలె నన్నిటను దానేయె పాఱాడి యిల్లు వెలిఁగించినది.

ఇట్లన్నిటను ఆమె జాణతనము సాఁగినదిగాని తన చిన్న మఱఁదలిని జూచినప్పు డేమిచేయవలయునో తోఁపలేదు వయసు చిన్నది; పొంగివచ్చు యౌవనము; అరుదైన చక్కఁదనము. కాఁపురమునకు వచ్చిననాఁటినుండియు మగనిమొగమైనఁ జక్కఁ గాఁ జూచినదో లేదో! తనవారు, నావా రనువారు లేరు. మీఁదు మిక్కిలి తా నెంత మనసునొచ్చి 'సలసలగు సత్త్వగుణామల చిత్తంబు వచ్చునట్లు భక్తి శక్తులు మెఱసి పాటులంబడు' ధర్మమును, కర్మముఁ గల యిల్లాలు. ఆ వేదనామూర్తి చూడ తన ధైర్య మెందుకును బనికిరాక వదినె, యు "పగచి పగచి తెగచి కడుపు చుమ్మలు చుట్టి కన్నీరుట్టిపడం బొట్టపొరలగుచుండినది." అనివార్యమగు దుఃఖమునకు హార్దమగు సహానుభూతియే ప్రతీకారము. ఇట్టి వదినెను సంపాదించుకొనఁగల పుణ్యవతులు మఱఁదండ్రెందఱుగలరు?

ఇట్లెన్నాళ్ళు గడచెనో! ఉన్నదున్నట్టుగా 'చుక్క తెగి పడినవడువున' ఒక్కనాఁడు తమ్ముడువచ్చి వాలినాడు. అప్పుల వారివలె ఆఁకలికిని దలదాఁచుకొనుట సాధ్యముగాదుగదా! ఎన్ని పూటలనుండి పస్తుండెనో! మధ్యాహ్న భోజనపంక్తికి తండ్రి మొగము కనఁబడునని భయము. కావున మెల్లఁగ తల్లిని బీడించి 'చల్ది వంటకము' దిని చప్పున తప్పించుకొనిపోదమని వచ్చినాఁడు,

కాలిడినవెంటనే అక్క మొగము కనిపించినది. తప్పించుకొని పోఁగలఁడా? ఆ ప్రేమమయి చిఱునవ్వు సంకెలలను ద్రెంచుకొని, ఆ మహనీయమూర్తి యెడ తనకుఁగల గౌరవభారమును దిగఁద్రోసి పోవుటకు శక్తియెక్కడిది? వచ్చి నమస్కరించినాఁడు. ఇతరులు పెద్దవారు తన్ను శిక్షింపఁగా "గిజుగుజుపడి నడికొప్పి గడిదేటి పంక పరకచాటున మాసి" 'రాజారోషు' గాఁ దిరుగమరిగినవాఁడు ఆమెయెదుర వంచినతల యెత్తలేఁడయ్యెను.

నమస్కరించిన తమ్ముని గౌఁగిలింపఁ బోయినది. కాని వానిని సమీపించి చూచినప్పుడు తాఁక మనసురాలేదు. ఎక్కడ చూచినను మేనినిండ 'మదోన్మత్తమత్తకాశినీదత్తంబులగు నఖాంకంబులు' నెత్తురులు చిలుకుచుండెను. మనసునఁగాని, మేనిలోఁగాని యింతయు మైల కెన్నఁడును చోటీయని యామెకు వాని యట్టి శరీరమును గౌఁగిలించుట యాయూరి వాడవదినెలఁ గౌఁగిలింతయే యగునని తోఁచెఁగాఁబోలు! ఊరక, లోనివెగటెల్ల నడఁచుకొని, 'సీమంతపుఁ బెండ్లికొడుకవు గమ్మని హేతుగర్భితంబుగా' ఆశీర్వదించినది. అతఁడు గుమ్మడికాయల దొంగ; గిలి యున్నది. ఆ దీవనలోని భావము కనుఁగొన్నాఁడు. ఉపన్యాసములు, ఉపదేశములు, చీవాట్లును ఈమెయు నుపక్రమించునేమో! ఇది యెక్కడి గొడవ; పోదమని యుంకించినాఁడు. ఆమె ప్రేలును జూపకయే హస్తమునే గాదు మేనెల్లఁ దిగమ్రింగఁగల జాణ. ఆత్రపడి వాని కసహ్యమైన భావమును సూచించి పొరపడితినని యెఱిఁగినది. వానిది సోఁకోర్వని సుకుమారత్వము. ఈ త్రోవ కాదని నిర్ణయించి 'తరఁగితవినయసౌహార్దమార్దవమధురంబులగు మాటల తేటలం బందిరి వెట్టి' నది. ఆ పందిరియే వానిపాలికి పంజరమై పోయినది. చాలనందుకు 'నీ చిన్న మేనల్లుని జూచితివా? ఇంద' అని యిందుబింబాననంటి తన కడగొట్టు కొడుకును ఊరక చూపలేదు—చంకకిచ్చినది. వాని మొగమునఁ గానవచ్చిన యాఁకలి నకనకలుచూచి, వీనిఁగట్టివేయు బ్రహ్మాస్త్రమిదిరా యని 'మా బావ బంతి నారగింతువుగాక, శాకపాకంబులు నిమిషంబులోనం గావింతు' నని ప్రయోగించినది. ఈలోన ముఖ్యమైన వ్యక్తిని మరఁదలిని

మఱచునా? ఆమెకు కనుసన్న చేసి వానికాళ్ళు గడిగించినది. ఇఁక ఇన్ని బంగారుచ్రాళ్ళనుండి తప్పించుకొనుట యెట్లు? వాఁడు గ్రుక్కుమిక్కనక తలంటుస్నానము, నూతనవస్త్రధారణము, వెండ్రుకల తడియార్పు, పూలముడుపు, గంధపున్పూఁత — మొదలగు నన్ని యుపచారములకును మేనొగ్గినాఁడు. అపురూపముగా మగనికీ సేవలు చేయఁగల్గి వానియిల్లాలు ధన్యురాల ననుకొన్నది. ఆమె యాశలు మొలచినవి.

ఇంతలో వంట తయారైనది. దేవతలకు బోనాలు పెట్టినంత... సామాన్యముగా మెచ్చుకొను స్వభావములేని పోరాని పెద్దచుట్టములకు విందులు చేసినంత .. శ్రద్ధతో భయముతో అక్క తమ్మునికి పలువగల వంటలు వండినది. 'కనుగీటినంతలోనె!' తలిదండ్రులకును భర్తకును మహానమంత్రము వేసినది. తన బిడ్డలతోపాటు వారిపంక్తిలో తమ్మునికి చేయార తానే తృప్తిగా వడ్డించినది. వాఁడు భుజించినపిదప ...ఎంత చెడినను వైదికుల యింటిబిడ్డఁడుగదా.... వార్చి యింటితిన్నెపైఁ గూర్చున్నాఁడు. భార్యకు రెండవమాఱు కనుసన్న చేయనక్కఱలేదుగదా! ఆమె వచ్చి అరుగుచెంత నిలుచుకొని తాంబూలము చుట్టియిచ్చుచున్నది. అతని కిప్పుడు పదునాల్గులోకములును చల్లగా సుఖముగా నిండుగడుపుతోఁ గానవచ్చుచున్నవి. చీవాట్లను, తిట్లను చిఱునగవుతో స్వీకరింపఁగల యుదారహృదయముతో నున్నాఁడు.

తానును యింతలో భుజించి వంటయింటిపనుల ముగించి వచ్చినది. పరగడుపుతో ఈ మహాకార్యము నెఱవేర్చుట తనకును కష్టముగదా. చంట వెంట సందడిసేయు సంతానము. నెమ్మదిగా అరుగుదగ్గఱ నిలిచి, చీరచేల చిట్టడవిగా నున్న వాని తలనుజూచి 'సీ! ఏమిరా యిది!' అని ప్రేమప్రస్తావనచేసి, జుట్టుముడి విడిచి విదలించి, ఈళ్ళు గ్రుక్కి, అంట్లఁ బొడిచి, గోరు ముక్కల దిగదువ్వి, తూరుపెత్తి, పేలనన్నిటిని దిగిచి, ముడివేసినది, వానిమెడకు మన్ను నలఁచినది. పాణిపద్మములు గరగరగా గడుగుకొన్నది. ఆవేళకు సరిగా అదనెఱిఁగిన మరఁదలు విడెము మడిచి యిచ్చుచుండఁగా దాసి తెచ్చిపెట్టిన పీటపైఁ గుడిప్రక్క

నించుక యోరగిల్లి కూర్చున్నది. ఎడమప్రక్క బిడ్డఁడు చన్ద్రావు చున్నాఁడు. ఈ తీవిని భావించి కవి "పద్మకర్ణికఁగొలువున్న పద్మవోలె" నన్నదన్న పోలికలో నతిశయోక్తి యేమైనఁగలదా? కావుననే యతఁడు ముక్కాలు మువ్వీసము ఆస్తియంతయుఁ కరఁగి పోయిన యాయింటిలోఁగూడ—నిగమశర్మ తల్లినడిగి కాఁబోలు— దాఁచియుంచిన 'పసిమి పసిఁడిపీవన' తెప్పించి మరఁదలిచే వదినెకు విసరించుచున్నాఁడు! వజ్రాలవీవనతో విసరినను ఆ దివ్యమూర్తికిఁ దక్కువయే కదా!

చెప్పవలసిన మాటలు చెప్పుట కింతకంటె మంచిసమయమేది? "ఏమి నాయనా! ఎన్నాళ్ళాయెరా మా యూరికి నీవువచ్చి? ప్రారంభించి యఖండముగా జరుగుచున్న వేదపాఠమునకు విఘ్న మగునని వెఱచితివి కదా!" అని తిన్నగా ఏసమాటలతో నుపక్ర మించినది. కాని ద్రౌపదివలెనే యామెయు 'రక్కసతాల్మి' తో మదిలో నణఁచిపెట్టుకొన్న యలుక యీ సన్నసన్న మఱుఁగు మాటలతోఁ దీఱునా? 'సాలగ్రామాల గనిలో గులకరాయివలె సముద్రమువంటి యాతండ్రి కడుపున ఇట్టివాఁడ వెట్లురా పుట్టితివి!' అని యొక్కమాటుగాఁ గసరి పల్కినది. బ్రహ్మనుండి తమవఱకు మచ్చపేరెఱుఁగని బ్రాహ్మణవంశమే! తలిదండ్రులు ముసలివారు. తమ్ములు కసుగందులు. తా నింటికి పెద్దకొడుకు. వారిగతి యేమి? చేసికొన్న యిల్లాలి దిక్కేమి? వచ్చిపోవు విద్వాంసుల మన్నించు మాట యెట్లు? ఇంటిమర్యాదల కేమిత్రోవ? తన యొక్కని చెడు నడవడిచే ఇంటివారందఱి శీలము పిల్లిశీలమని, చదువులు చిలుక చదువులని తోడివారెల్ల నవ్వుచున్నారే! "ఏల యిట్లు బేలవైతివి? అన్నా! ఏల నీ కీ గుణము?" అని కడుపోపక కెరలి పల్కినది.

కాని యిది తప్పుదారి. పాపము చేయువారు తిట్లచే నెప్పుడును తమనడత మానరు. మీఁదుమిక్కిలి తిరుగఁబడు దురు. వెనుక గురుజనము శిక్షించినప్పుడు వారి కదే మర్యాద జరిగినది. వచ్చినపని వానిని దారికిఁ దెచ్చుటకాని తనకడుపు కసిదీఱ నాలుగుతిట్లు దిట్టి మరలిపోవుట గాదు. అది యుదా

సీనులు, అజ్ఞానులును జేయుపని; హితకాంక్షులు చేయునదిగాదు. ఆ 'కుశలాశయ' కిది తెలియకపోవునా? అలుక మగిడించి కొన్నది. స్వరము మార్చినది. సామరస్యము వెలిఁబుచ్చినది. 'భారతమునకు కర్ణునివలె నీవే యీయింటి కాధారము. నీవు లేనిది కథనడువదు' అని యతని పౌరుషమున కన్వయించి పురి కొల్పినది. 'నీవు యజ్ఞము చేయఁగా వేదికను నే నలంకరించి సుమంగలీపూజలందుదునని గంపెడాసతో వేయిమందిలోఁ జెప్పు కొన్నానే! నాయాశలు త్రెంచితివే!' యని సౌభ్రాత్రమును జూపి కన్నీరుపెట్టుకొనఁబోయినది. 'కామశీకారము బలమైయుండె నేని రూపగుణకులశీలములు గల్గు బ్రాహ్మణకన్యలను వేయిమందినైనను బెండ్లాడరాదా! బ్రాహ్మణగృహస్థునికి బహుపత్నీవ్రతము తప్పని యెవరు చెప్పఁగలవారు! ఈ పాడు వారకాంతల వ్యవహారము నీకెందుకు? వారిదోపిళ్ళకు మన్నీలు, ఆఢ్యులును దట్టుకొనఁజాలరే! ఇంక బాపన సంసారులము మనగతి యేమి?' అని తీవ్రమైన వ్యావహారికదృష్టితో వాదించినది. "అదియుఁబోనీ! చేతనున్న డబ్బు మాత్రము తెలిసితో వెచ్చించి యూరకుంటివా! అక్లైయుండిన నాకింత దుఃఖముండదే! 'ముక్తాహారంబందు నఖండ సేతువృతముల్ కాశ్మీరఖండంపుఁ గేదారంబుల్ తెగనమ్మి'తివే! నీకేమి భార్య లేదా? బిడ్డలు పుట్టరా? వెన్నంటి పుట్టిన తమ్ములు లేరా? ఇట్లు కులధ్వంసము చేయుదురా యెవరైన?" అని తనవారి తప్పులను క్షమించి సరి పుచ్చుకోఁగల స్త్రీహృదయమార్దవమును వెలువఱచి అధర్మము చేసినను అవివేకముగా చేయరాదను సామాన్యన్యాయమును సాటి చెప్పినది. వేశ్యాజనుల వంకరటంకరలన్నియు సూదులతోఁ బొడిచి నట్లు వాని గుండెకంట నొత్తి గ్రుచ్చి యెత్తిపెట్టినది. కడకు వాని చేతిలో చేయివేసి 'చేయిమీఁదుగా నడచిన పూర్ణకాముఁడవే! నా తమ్ముఁడవే! నీకీ బికారితనమేల? వలదు నాయనా! ఇంకనైన వదలు తండ్రీ!' యని దీనదీనముగా వేఁడుకొన్నది. 'నీకు గావలసెనా హరికౌస్తుభమైనఁ దెచ్చెద' నని ధీరధీరముగా ప్రతిజ్ఞ చేసినది! తమ్మునికి దెచ్చి యీకున్నను ఆమె తానే కౌస్తుభమై తెనాలికవి మూలమున తెలుఁగువారి చేతి కబ్బినది!

ఇంతటి తెలివితెగువలు, నగవుబిగువులు, అందచందములు కరువుపోసి తయారుచేసిన అపూర్వామృతమూర్తికి రామకృష్ణకవి దృష్టిచుక్కగా నొక మసిబొట్టు ముక్కుపైఁ బెట్టినాడు!

అక్క సద్బుద్ధిమాట లాదరించి నిగమశర్మ నాల్గునాళ్ళింటిలో వివేకము దెచ్చుకొన్నవానివలె నుండి, యొకనాటిరాత్రి చేతికి దొరకిన యింటిసొమ్ములనెల్ల హరించి మూటగట్టుకొని పండుకొన్న 'పడుకకును జెప్పక' పాఱిపోయెను. అప్పు డింట నందఱు నేడ్చిరి. వారితోడ నక్కయు నేడ్చినది. ఎందుకనుకొన్నారు? తమ్ముడు చెడెనే యని కాదు; ఇల్లు మునిఁగెనే యని కాదు; తనప్రయత్నము వ్యర్థమాయెనే యనియునుగాదు! మఱి 'క్రొత్తగా యించుకొన్న ముక్కర' పోయెనే యని 'దుర్వారమై' యడలెనఁట!

పరిహాసము పవిత్రవస్తువునుగూడ గమనింపదేమో!

# రంగనాథ రామాయణము*

౫

డాక్టర్ సర్ కట్టమంచి రామలింగారెడ్డిగారి యాజమాన్యమున ఆంధ్రకళా పరిషత్తునందు జరిగిన ఘనకార్యములలో రంగనాథ రామాయణమును సంస్కరించి ప్రకటించుట యొకటి. రంగనాథ రామాయణము ద్విపద కావ్యములలో నగ్రగణ్యము; తెలుఁగు సాహిత్యమందలి యుత్తమోత్తమ కావ్యములలో నొకటి. ఆవేశమునకుఁగాని యుద్రేకమునకుఁగాని లోఁగక గంభీరభావములతో గజగమనముతో నడుచు రచనలలో కవిత్రయకవితకు తరువాత దీనినే పేర్కొనవలయును. పరిషత్తువారు దీని నింత యందముగా, శుద్ధముగా ప్రకటించి తమగౌరవమును, కావ్యగౌరవమునుగూడ హెచ్చించిరి. వారికి ఆంధ్రులపరమున నా హార్దమైన ధన్యవాదములు.

ఈ కావ్యగౌరవమునకు తగినట్లు దీని శోధించు కార్యగౌరవము సుగృహీతనామధేయులగు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిల వారిచేతి కబ్బినది. ఈ పనిని వారికంటె సమర్థతతో, శ్రద్ధతో నిర్వహింపగల సిద్ధహస్తులు నా యెఱిఁగినంతలో వేఱొక్కరు లేరు. వారికి చేదోడు వాదోడుగా నా మిత్రులు శ్రీ గన్నవరపు సుబ్బరామయ్యగారును చాల పనిచేసిరని వినికి. కాని వారిపేరీ కూర్పులో ఎక్కడను కానరాకపోవుట చింతనీయము.

మఱి ప్రభాకరశాస్త్రిగారిదిగూడ తెరమఱుఁగు పనియే యైనది. పీఠికలలో వారిపే రుల్లేఖింపఁబడి యుండకపోయినచో వారిదిగూడ 'నిర్నామ' కర్మమే యైయుండెడిది. కాలమునకు సరిగ వారికి 'అనారోగ్యము' గల్గుటచే, వారు వ్రాయవలసిన, వ్రాయఁగలిగిన విపులమై ప్రామాణికమైన పీఠికతో చేర్చి యీ గ్రంథము

* ఆంధ్రవిశ్వకళాపరిషత్తువారి ప్రచురణ : సుమారు ౯౦౦ పుటలు.
వెల రూ. ౭-౮-౦ పరిషత్తు రిజిష్ట్రారుగారినుండి పడయవచ్చును.

చవిగొను భాగ్యము చదువరులకు లేకపోయినది. ఇది త్వరలోనే రెండవకూర్పుకు రావలసినది గాన అప్పటికైనను శాస్త్రిగారి యుపోద్ఘాతము రాఁగలదనునాశకును అవకాశమిప్పటి పీఠికలలో లేదు. "ఈ రంగనాథ రామాయణమునకు నెంతో విపులమైన విమర్శ వ్రాయవలెనని యున్నది. కాలానుకూల్యమునుబట్టి ఆపని భావి కాలమున నెఱవేర్పగలనని యాశపడుచున్నాను"[1] అని యా భార మంతయు తమమీఁదనే వేసికొన్నారు. శ్రీ పింగళి లక్ష్మీకాంతము గారు తమ సంగ్రహ పీఠికలో, శాస్త్రిగారి యారోగ్యము వారు శాశ్వతముగా పీఠికా రచన చేయలేనంత చెడినదని యూహింప భయపడుచున్నాను. శాంతం పాపమ్!

మఱి పీఠిక వ్రాయవలసిన భారము రెడ్డిగారిపై పడఁగా వారికిని అనారోగ్యమే విఘ్నమై దాపురించినది![2] కాఁబట్టి వారు లక్ష్మీ కాంతముగారిని నియమించినారు. వారి పీఠికయైనను విపులముగా లేకున్నను స్వతంత్రముగాఁగూడ నుండజాలకపోయినది. రెడ్డిగారి యభిప్రాయములను తమ యభిప్రాయములతో 'జోడించి పొందించి'[3] వ్రాయవలసివచ్చినది. కాని రెడ్డిగారి యభిప్రాయములు కొన్నిటితో పూర్తిగా ఏకీభవించుట పలువురకు సాధ్యమైన పనిగాదు. వారి శక్తి యుక్తులను గౌరవించినంత హార్దముగా వారి యభిప్రాయములను అంగీకరించుట నావంటివారికి పలుమాఱు గల్గు భాగ్యము గాదు. అవి చాలమట్టుకు అపూర్వములు, స్వచ్ఛందములు, విప్లావకములు. కనుక నేకాఁబోలు లక్ష్మీకాంతముగారి పీఠికతో వారు తృప్తిపడక అందలి ముఖ్యభావములకే మఱికొన్ని చేర్చి తమ ధీరవినయముద్ర నిచ్చి 'అనుబంధపీఠిక' యొకటి వ్రాసి చేర్చిరి.

పై రెండు పీఠికలనే యిప్పుడు నేను గొంత చర్చింపఁబూని నాను. రెంటియందును గ్రంథసంపాదనకు, శోధనకు సంబంధించిన విషయములేమియు వెలువడలేదు. ఈ కార్యమునం దుపయోగించిన

1. ల. కా. గారి పీఠిక, పుట ౨౦
2. చూ : అనుబంధపీఠిక, పుట 1.
3. ల. కా. గారి పీఠిక, పుట ౨౧.

వ్రాఁతప్రతులెన్ని ; ఎప్పటివి ; వాని తారతమ్య మెట్టిది ; అచ్చుప్రతు లెన్ని; వాని స్వరూప మెట్టిది; పాఠ పాఠాంతరముల, ప్రక్షేప విక్షేపముల నిర్ణయ మేసూత్రప్రకారము జరిగినది—ఇత్యాది ప్రశ్నల కిందు ప్రత్యుత్తరమే లేదు. పూర్వముద్రణమునందుఁ గల్గి, వ్రాఁతప్రతులలో లేని భాగము ౧-వ అనుబంధముగాను, ముద్రణమున లేక వ్రాఁతప్రతులలో నుండు భాగములును, ముద్రణమందలి పాఠములకు భిన్నములగు వ్రాఁతప్రతులలోని పాఠములును గలిపి ౨-వ అనుబంధము గాను, సుమారు రెండువందల పుటల గ్రంథమును కడపట ముద్రించినారు. ఇది సరే. కాని ప్రధానగ్రంథము ప్రతిపుటయందును క్రింది చిన్నచ్చులో ఎన్నో పాఠభేదములను చూపినారు. దీనియర్థము స్పష్టము చేయలేదు. పాఠములన్నియు క్రిందిపాఠాంతరములకన్న సరసములని చెప్పలేము. ఉదా: బాలకాండ ౨౨-వ పుటలోని ప్రధాన పాఠమిది :

"కొద్దిగా ముత్తెంపు గొనబువజ్రాల
మద్దికాయల డాలు..."

దీనికి క్రింది పాఠాంతరమిది :—

'కొద్దిగా ముత్తెంపుఁగొనల ప్రాఁగెంపు
మద్దికాయల డాలు..."

మొదటిదానికంటె రెండవది స్పష్టము, ఉచితము. ముత్యాలు కెంపులతుదలో కూర్చుట సహజము, అందము ; కాని వజ్రాలతోఁ గూర్చిన ఫలమేమి ? ఇట్టి వింకను గలవు.

క్రీగీత క్రింద పాఠములన్నియు ఒకటిరెండు పదములకో, అక్షరములకో సంబంధించినవనుటకును వీలులేదు. కొన్ని ద్విపదలనే అట్లు క్రింద చేర్చినారు.[1] మఱియు ప్రధానగ్రంథభాగమునందే కొన్నిచోట్ల కొంతగ్రంథమును అర్ధచంద్రరేఖలమధ్య చేర్చి ముద్రించినారు.[2] అనుబంధములు రెంటిలోను చేరరాని నాల్గవ యైదవ తరగతి పాఠభేదములా యివి ? అనఁగా నెట్టివి ?

---

1. చూ : పుట ౧౨౭, 2. పుట ౨౩౬.

మఱియు ప్రాఁతముద్రణముల పాఠములకును, అట్టివనఁబడు ౧-వ అనుబంధమునందలి పాఠములకును వ్యత్యాసములు గానవచ్చు చున్నవి. నేను వావిళ్ళవారి ముద్రణము మాత్రము చూడఁగల్గితిని. ఉదా :

౧. వావిళ్ళవారిపాఠము—

"చెప్పిపోతువు నాతో సేమ ముప్పొంగ"[1]

ప్రకృత ముద్రణానుబంధమున—

"చెప్పిపోదువునన్ను సేమ ముప్పొంగ"[2]

౨. వావిళ్ళవారిది—

"చింతించి తన మది నిర్జించి మఱియు"[3]

ప్రకృతముద్రణముది

"చింతించి తన మదిఁ జింతించి మఱియు"[4]

మొదటిదానియందలి 'నాతో' అను అపభ్రంశము తొలఁగుటకై 'నన్ను' అను అనన్వితమగు సవరణ; రెండవదానియందలి మొదటి యతిభంగదోషమునకు తరువాతిదాని పునరుక్తి ప్రాయశ్చిత్తము! ఈమార్పు లెట్లువచ్చినవి ?

ఇట్టి ప్రశ్నలకు సమాధానము లీ కూర్పులో మృగ్యములు. సమాధానము లీయఁగలవారు శోధించిన పండితులు. వారి కవకాశము లేని సమయములో, ఇవన్నియు నట్లుండగా, పీఠికాకారు లిద్దఱును పరిశోధకులు చేసిన యొకపనిని చేయరానిదని స్పష్టముగా చెప్పినారు! అదేదనఁగా: యుద్ధకాండమందలి సులోచనా వృత్తాంతమును ముఖ్యభాగములో చేర్పక అనుబంధములతో చేర్చి యుండుట. పరిశోధకులకు సులోచనకథ మూఁడు పాఠములుగా దొరకినది; ప్రాఁత ముద్రణములలోనుండి, వ్రాఁతప్రతులలో కానరానిది యొకటి; ఐదుపుటలు నిండు గ్రంథము. దీనిని ౧-వ అనుబంధమునఁ జేర్చినారు. ముద్రణములలో లేక, వ్రాఁతలోమాత్ర

1. పుట ౪౭౫, 2. పుట ౬౭౦, 3. పుట ౪౭౯, 4. పుట ౬౭౩.

ముండునది రెండవది. ఇది సుమారు ౭౨ పుటల గ్రంథము. మూఁడవది ముద్రితపాఠపు రచనాంతరము; నాలుగుపుటలంతటిది. ఈ రెంటిని రెండవ అనుబంధమునఁ జేర్చినారు. అనుబంధముల నేర్పఱచుకొన్న పద్ధతియే యిది గావున పరిశోధకు లిందు చేసిన యన్యాయ మేమియు లేదు.

కాని పీఠికాకర్తలిద్దఱును అట్లు తలఁపలేదు. సులోచన వారి మనస్సులను చాల ఆకర్షించినది. ఎవరి నాకర్షింపదు? మునీశ్వరులకైనను, ముసలి యవ్వలకైనను ఆ సృష్టి ముద్దబంగారు వంటిది. కాని ప్రకృతప్రశ్న అదిగాదు. మఱి యీ రామాయణ కర్త అసలు దానిని వ్రాసెనా? ఇప్పుడు దొరకిన త్రివిధ భిన్నగ్రంథ ములలో ఏది యతనిది? ఏదియుఁ గాదా? అనఁగా అతఁ డీకథనే వ్రాయలేదనియూ, లేక వ్రాసినది మనకు లభింపలేదనియూ—అనునవి. ప్రకృతము దొరకిన సామగ్రినిబట్టి పై మూఁటిలో నేదియు అసలు కర్తది కాదేమోయని సందేహించి శోధకులు వానిని అనుబంధముగా సంగ్రహించినారు. కాని రెండవది, మూఁడవది యట్లుండఁగా మొదటి రచనమాత్రము—అనఁగా ప్రాఁతముద్రణములది—మూల కర్తదే యనుకొని గ్రహించి పంక్తిలో చేర్చవలసియుండెనని రెడ్డి, లక్ష్మీకాంతముగార్ల వాదానువాదములు. కారణమేమి? "ఆ పూర్వ ముద్రణము వేయించినవారికైనను నేదో యొక వ్రాఁతప్రతియే యాధారమైయుండును గాని స్వంతకవిత్వము చెప్పియుండరుగదా!" అని లక్ష్మీకాంతముగారి ప్రశ్న.[1] ఏల చెప్పియుండఁగూడదు? స్వంత కవిత్వము వ్రాఁతప్రతులలో చేర్పఁగల్గి, చేర్చినవారి గోత్రో ద్ధారకుల మగు మనకు అచ్చులో ఆపని చేయుట అనాచార మని పించునా? రంగనాథ రామాయణ మిదివఱకు అచ్చువేసినవా రట్టిపని చేసినారని నే ననునది. మఱి అట్లుచేయుట అసాధ్యమని, అసంభవ మని పురస్సిద్ధాంతముతో ఈ చర్చకు దిగరాదని మాత్రమే. గొప్పవారే అట్టిపని చేసినవారు ఒకఱిద్దరిని నేను స్వంతముగా ఎఱుఁగుదును. మఱి, యిటువంటివారే కొందఱు, సులోచనకథ

1. ల. కా. పీఠిక, పుట, ౨౦.

వాల్మీకి వ్రాసినది కాదు కావున, ఈ రామాయణకర్త అసలు వ్రాసి యుండినను, తమ ప్రతులలోనుండి దీనిని విక్షేపించి యుండఁగూడదా యనవచ్చును. కూడకేమి? కాని యీ రామాయణమున ఆపని జరిగిన సూచనలు లేవు. లక్ష్మీకాంతముగారు చెప్పినట్లు[1] కవి యిందలి "ప్రతికాండమందును ఏదో యొక యవాల్మీకాంశమును కల్పించుచునే కథ నడపెను." ఇంతే కాదు. ప్రతిపాత్రపు నడక యందును, ప్రతికథాసందర్భమందును సూక్ష్మముగా గోచరించు అవాల్మీకవిషయము లెన్నో ఇందుఁ గలవు. అవన్నియు నట్లే యుంచి ఒక సులోచన కథమీఁదమాత్రము కసిదీర్చుకొను నక్కఱ వాల్మీకి భక్తుల కేల కలుగును? ఈ కారణముచేతనే యీ సులోచనకథ యిందు ప్రక్షిప్తముగా నుండవచ్చునను శంక బలియుచున్నది.

ఉన్న వ్రాఁతప్రతులనుబట్టి అసలుపాఠమును నిర్ణయించు పనిలోఁ గల కష్టనష్టములను రెడ్డిగారు పేర్కొన్నారు. కాని యదంతయు సులోచనకథను మూలములో చేర్పకపోవుట న్యాయమా యను ప్రశ్న మనసులో నుంచుకొనియే చేసిన చర్చ. కావున అచ్చుప్రతిలోని సులోచనకథ అసలు రచనలోనిది కాదని నికరముగా నిర్ణయించుట సాధ్యము కానిపని యని సూచించిరి. కాని ఔనని చెప్పుటయు అట్టి "ప్రాయోభావముమాత్రమే" యనుట వారెఱుఁగకపోలేదు. కాఁబట్టి యిట్టి చిక్కులలో 'శైలిని బట్టి నిర్ణయించుట సర్వసమ్మతమైన పద్ధతి'[2] యని, అచ్చుకెక్కిన సులోచనా గ్రంథము శైలిలో "బుద్ధకృతమట్లున్నదని నా యభిప్రాయము" అని తీర్మానించి వివాదమును తెంచిరి.[3] ఆ మాటనే లక్ష్మీకాంతముగారు "ఒకటవ యనుబంధములోని యీ కథారచన ప్రధానగ్రంథరచనకు ననుగుణముగా నున్నది గాని యన్యకర్తృక మనిపించుట లేదు" అని యనువదించి, ఆ కారణముచే ఇది "అనుబంధమునఁగాక ప్రధానగ్రంథమునఁ జేరియుండవలసినది", "ఈ గ్రంథపరిష్కర్తలు తెలియమిఁగున నిలుపక రంగముననే ప్రద

1. ల. కా. పీఠిక, పుట ౨౦౧-౧౫. 2. అను పీఠిక, పుట iii 3. అదే, పుట iv

ర్శించియుండవలసినది'',[1] అని నిస్సంశయముగా, నిర్దాక్షిణ్యముగా శోధకులను శాసించిరి.

ఈ యిరువురు రసిక పండితప్రకాండుల యభిప్రాయముతో నేకీభవించు భాగ్యము నా కిందు లేదని చింతించుచున్నాను. అచ్చులోని సులోచనకథ రంగనాథరామాయణ రచనకన్న భిన్నముగాను, పలువిధములలో అపకృష్టముగాను కానవచ్చుచున్నది — నా దృష్టికి. ఇది కేవలము ఆత్మసాక్షికమగు మాటకాదు. ఇందుకు నా కారణము లివి :

అసలు రచన చాల శుద్ధమైనది; బిగువైనది; మితి నెప్పుడును మీఱనిది; ధారాళమైనది. ఇంక దీనియందన్నో యతి ప్రాస దోషములు, అన్వయదోషములు, అపశబ్దములు, పునరుక్తులు, సంప్రదాయ విరోధములు, వ్యర్థపదములు నిండియున్నవి. వా రిచ్చిన యనుబంధమునుండియే ఉద్ధరించుచున్నాను. చిత్తగింపుఁడు :

(అ) ''ఐన సులోచన యాత్మేశుచావు
విని చాల వగచుచు వివశతనొంది.''[2]

(ఆ) ''అనిన నా దశకంఠుఁ డతివ వీడ్కొలుప
మానినియును దన మామకు మ్రొక్కె.''

లఘు గురు పూర్వకములగు వ్యంజనముల కితఁడు ఎక్కడనైనను ప్రాసలో ఇట్టి యభేదము నంగీకరించినాఁడా ?

(ఇ) ''అరిగిన హరిహరాదుల కజేయుడవు
నరులనఁగా నెంత...''

'అలిగిన' యని పాఠమేని ప్రాసయతి, రలప్రాసమును. అది అసలు కర్తకు సమ్మతమా ?

(ఈ) ''చెప్పుమేర్పడ నీదు చందంబటన్న''

1. ల. శా. పీఠిక, పుట ౨౦.
2. ౧ అనుబంధము, పుట ౬౭౧.
ముందటి ద్విపదలును ఆ రెండు మూఁడు పుటలలోనివే.

(ఉ) "అని మారుతాత్మజుఁ డాడు వాక్యములు
అన విని తలపోసి యప్పు డిట్లులనియె."

ఎవరు? రాముఁడని కర్తను తెచ్చుకోవలయును.

(ఊ) "జలజాక్షి యింకొక జన్మంబునందు
కలసెదు భువిఁ బెద్దకాలంబుదాఁక"

ఎవరిని? 'భువి' 'పతి' కి బదులుగా పడిన లేఖకదోష మందురేమో! కాని యీ రాముని వరముచే సులోచనకును, ఇంద్రజిత్తునకును గల్గిన జన్మాంతరమేది? దాని కథ యేమి? లేక యీ వరము 'శుష్కోపచారము, శూన్యహస్తము' నకుఁ జేరినదా? 'కలసెదు' అనుటకు కలిసియుండెద వని యర్థము చేసుకోవలెనా?

(ఎ) "తరమిడి యీ రామ ధరణీశునాజ్ఞ
తలనిడి యీ యింతి పతికళేబరము
నిచ్చిన నురముపై నిడి రాఘువునకు
నచ్చపు భక్తితో నతివ వీడ్కొలుప
నతివేగమునఁ బురి కప్పుడే పోయి
యతివమందిరమున కప్పుడు పోక"

(ఏ) "వెలయంగ యోగ వియోగముల్ బ్రహ్మ
వెలయంగఁ గల్పించె వెలఁది జీవులకు
నిటుగాన మఱి కాలహేతువుగాన
కుటిలకుంతల................"

మఱి ఆదిశేషుఁడు తన బిడ్డను సులోచనను ఇంద్రజిత్తు కెప్పుడిచ్చెను? ఎందుకిచ్చెను? లక్ష్మణరూపమున అతఁడే అల్లుని నేల చంపెను? స్వరూపముతోనే యేల చంపలేదు? ఇంకేదో పురాణములో ఈ రామాయణమంతా కలదందురా? మాకేమి లాభము? 'అంగట్లో అష్టభాగ్యం—అల్లుని నోట్లో శనేశ్వరం' అన్నట్లున్న దీ వ్యవహారము.

ఇంకొకవింత ఈ కథలో: సులోచన రణరంగమందలి రాము నిఁజూడ రథమెక్కి వచ్చుచున్నది; ఆమె తేజస్సుచూచి విస్మితులై యందఱును రావణుఁడు పంపఁగా సీతమ్మయే వచ్చుచున్న దేమో యనుకొన్నారు. అప్పుడు హనుమంతుఁడు,

> 'భామినీమణిఁ జూచి పరగ రామునకు
> దామసింపక వేగఁ దగ విన్నవించె
> ఈ మానవతి మదినెంచఁగా దేవ
> భామగాదిది ధరాపుత్రియుఁ గాదు
> మానుగాఁ బతిలేని మగువయే కాని
> దానికి నదిగో ప్రత్యక్షంబు గలదు
> అప్పుడఁతుక యున్న యరదంబుమీఁద
> గప్పిన ధూళి రాఘువ విలోకింపు'

అనఁగా రథముమీఁద ధూళి గప్పియుండెనా లోపలనున్నది విధవయేకాని సధవ కానేరదని 'పరమ పావనుఁడైన పవమాన సుతుఁడు' శకునశాస్త్రము చెప్పినాఁడు!

ఈ మచ్చులు చాలుననుకొందును. ఇందుమీఁదఁగూడ ఈ ముద్రితసులోచనాకథ ప్రధానరచనతో సమముగానే యున్నదని భావింతురేని, ఇదేరీతితో వ్రాయఁబడినది, ఇంకను కాళ్ళును చేతులును పెరిగిన కథ గలది, దీనికన్న కనీసము పదింతలు పెద్దది ఐన ౨-వ యనుబంధములోని రచన యేమిపాపము చేసినది? అది గూడ బుద్ధారెడ్డికే సమర్పించితిమేని ఇంతకంటె గొప్ప గ్రంథము రచించిన గౌరవ మతని కబ్బునుగదా!

ఇది యిట్లుండఁగా నిజముగా ప్రధానగ్రంథరచనతో పోలఁ గల్గిన భాగములు రెండనుబంధములందును ఎన్నియో కలవు. వానిని గూర్చి యేల పీఠికాకర్త లీ యాక్షేపము చేయలేదు? పరిశోధకు లీ గ్రంథశోధనవిషయమున నాశ్రయించినపద్ధతి నాకు తెలిసినంతవఱకు నిర్వివాదమైనది. అంతకంటె మంచిపద్ధతిని సూచింపఁగల్గువఱకు దానిని తప్పుపట్టు నధికారము మనకు లేదు. ఆ పద్ధతి పూర్తిగా నిర్దోషమని యెవరును చెప్పలేరు; మఱియు ఏపద్ధతిగాని అట్లుండఁ

జాలము. బుద్ధారెడ్డియే వ్రాసిన ప్రతి యొకటి మనకు లభించినను అందలి దే కర్తరచించిన కడపటిపాఠమని ప్రతిజ్ఞ చేయలేము. ఎందు కనఁగా: కర్తయే వేఱొకప్రతి వ్రాసియో, వ్రాయించియో యుండఁగూడదా? అందులో తరువాత తోఁచినమార్పులు, చేర్పులు చేసియుండఁగూడదా? ఇప్పుడు కర్తలు తమ గ్రంథములకు రెండవ మూఁడవ కూర్పులు సంభవించినప్పు డట్టిపని చేయరా? కాఁబట్టి యిప్పటి స్థితిలో ఇట్టి విషయములలో రెడ్డిగారు శంకించినట్లు 'కొంచెమో ఘనమో యైన ప్రాయోభావమే' 'సాధ్యమైన సిద్ధి.'[1] చరిత్రదృష్టితో నిర్ణయింపఁ బూనుకొన్నవారి కింతకంటె ఎక్కువ కాసపడు నధికారము లేదు.[2]

ఈపీఠికలలో ఎక్కువ యభినివేశముతో చర్చించినవిషయము ఈ రామాయణకర్త యెవ రనునది. గ్రంథమునందు కోన బుద్ధారెడ్డి రచించెనని స్పష్టముగా నున్నది. ఉత్తరకాండను ద్విపదగానే రచించిన కాచవిభుఁడు, విఠ్ఠలనాథుఁడును తమతండ్రి బుద్ధభూవిభుఁడే దీనిని వ్రాసె నన్నారు. దీనికి ప్రతిగా ఈ గ్రంథమునకు రంగనాథ రామాయణమని పేరువచ్చినది. రంగనాథుఁడను కవి రచించి దీనిని ధనాశతోఁ గాఁబోలు బుద్ధరాజున కంటఁగట్టెనను ప్రతీతి యున్నది. కూచిమంచి తిమ్మకవి మొదలగు లాక్షణికులు 'రంగనాథుని రామాయణము' నుండి కొన్ని ద్విపద లుదాహరించినారు. ఇంతేకాని రంగనాథుఁడే దీనిని రచించినట్లు ఈ గ్రంథమం దెందును నిదర్శనము లేదు. రంగనాథుఁడనువాఁ డొకఁడు కవులలో పరిగణితుఁడై స్తుతికెక్కినాఁడు. అతఁడు రచించిన గ్రంథములేవో తెలియదుగాని యతనివనఁబడు పద్యములు కొన్ని కొందఱు లాక్షణికులును, సంగ్రాహకులును ఉదాహరించినారు. అవి యతని కవితాసామర్థ్యమును, ప్రాచీనతను చాటఁజాలియున్నవి. స్పష్టతకై యొకటి యనువదించెదను:

1. అను. పీఠిక. పుట III

2. ఈ సందర్భమున రెడ్డిగారు 'తిక్కన్నతారచించిన భారతములో భగవద్గీతను సంక్షేపముగా తెనిఁగించినవాడని కొందఱందురు. నిజము

"అదలని తేరు, తేరునకు
నాదరువై తగు విల్లు, వింటికిన్
గుదురగు నారి, నారిపయిఁ
గూర్కు శరంబు, శరంబు బొడ్డునం
బొదలినయంత, యంతముఖ
ముల్, నిజవాసములైన గుబ్బముల్
చెదరక నీకు నెట్టిపని
సేయునయా గిరిజాధినాయకా! [1]

ఇప్పుడు రెండు ప్రశ్నలు: రంగనాథుఁడనువాఁడీ రామాయణమును రచించి బుద్ధారెడ్డిపేరఁ బ్రకటించెనా అనునది యొకటి, ఇతర కవులచే స్తుతింపఁబడిన రంగనాథుఁడే యితఁడా అనునది రెండవది.

మనదేశమందలి రాజప్రజల సంవ్యవహారము నెఱిఁగినవారికి ఇట్టికార్యములు అసంభవములుగా కానరావు, కావున, ఇదివఱకును రంగనాథుని కర్తృత్వమునుగూర్చి తెలుఁగువారు సంశయింపక ఉండవచ్చుననుకొని యూరకుండిరి. నే నెఱిఁగినంతవఱకును ఇది సత్యముగాదను వాదమును లేవఁదీసినవారిలో రామలింగారెడ్డిగారే మొదటివారు. వారి కవిత్వతత్త్వవిచారమున "రంగనాథుఁడనువాడు

కావచ్చును, కాకయుఁ బోవచ్చును. తిక్కనయొక్క సంస్కృతప్రతిలో ఇప్పటి ౧౮ అధ్యాయముల గీత యుండినదని యేమి నిజము?' (చూ.అను.పీ. IV) అని యొక శంకాస్త్రమును వదలిరి. భగవద్గీత భారతమునఁ జేరినట్లు, అందు ౧౮ అధ్యాయము లున్నట్లు తిక్కనకంటె ఎన్నోవందలయేండ్లక్రిందనే నిర్ణీతమై ప్రసిద్ధికెక్కెఁబడినది. ఎందఱో భాష్యములు, టీకలు అప్పటికే వ్రాసియుంచిరి. తిక్కన శంకరమతానుయాయి. శంకరభాష్యమునే యత డెఱుఁగఁడనుకొనవలెనా? ఇంతేకాదు. తిక్కన చేసిన సంగ్రహాను వాదమునే కొంత సావధానముగాఁ జూచితిమేని అతఁడే తాను సంగ్రహించిన భాగములను స్పష్టముగా సూచించియుండుట యెఱుఁగవచ్చును.

1. శ్రీ ప్రభాకరశాస్త్రిగారు, పెదపాటి జగన్నాథకవి సంగ్రహించిన ప్రబంధరత్నావళిలోనిదని తాము సంగ్రహించిన ప్రబంధరత్నాకరమునచేర్చిన పద్యము. చూ: పుట ౧౧౯ - ౨౦.

కట్టుకథలకుఁ జేరినవాఁడు గాని నిజమైన వ్యక్తి కాఁడు" అన్నారు. మఱి భుజంగరావు, చెంచయ్యగార్ల ఆంధ్రవాఙ్మయచరిత్ర పీఠికలో ఈ మాటయే చెప్పిరి.[1] ఇప్పుడు తమ పీఠికలో "రంగనాథుఁడను నొక కృత్రిమపురుషునకుఁ గొంద ఱీ గ్రంథకర్తృత్వము నారోపించి యున్నారు" అని వ్రాసినారు.[2] మఱి యీ గ్రంథమునకు రంగనాథ రామాయణమని ప్రాఁత పేరే యీముద్రణమం దుండనిచ్చినను తమ పీఠికలో దీనిని 'గోనబుద్ధరామాయణ' మనియే పేర్కొన్నారు.[3]

ఏల? రంగనాథుఁ డను నొక కవి యుండుట, అతఁడు రామాయణమును రచించుట, తన్నుఁ బోషించిన రాజునకు దానికర్తృత్వము ను ధారవోయుట—ఇవి యసాధ్యములా? అసంభవములా? రాజుల ప్రభువుల జీవితములో ఇట్టివ్యవహారములు మనలో ననాదిగా నున్న వేకదా! ప్రవరసేనుడు, శ్రీహర్షుఁడు, భోజుడు, తిరుమలదేవ రాయఁడు మొదలగువారినిగూర్చి ఇట్టికథలు లేవా? అవన్నియు నిరాధారములే యనఁగలమా? ధనాశచే తాము రచించిన గ్రంథములను ప్రభువుల కీయవలసియు పూర్తిగా ఆత్మాపహారము చేసికొన నిష్టపడక, తమయింట వేఱుప్రతులను వ్రాసికొని యందు తమకర్తృత్వము తృప్తిగా స్థాపించుకొన్న కర్తలు లేరా?[4] రాజులకు గ్రంథరచనాసామర్థ్య ముండదని సామాన్యన్యాయము నెవరును

1. "Men of genius like Kona Buddha Reddy, the author of the Ramayana which has been spuriously attributed to a mythical Ranganatha, were able to Dravidianise the Ramayana itself"—The History of Telugu Literature by Raja Bhujanga Rao and Chenchiah; Preface by C. R. Reddy.

2. పు. II

3. బుద్ధారెడ్డి యింటిపేరు 'కోన' గాని 'గోన' కాదు. గోనశబ్దముగము లేనిది. గసడదవాదేశపుమహాత్మ్యముచే వచ్చిన మార్పు. ఇది 'సాగరాంధ్రుల' లో వాడుకలో నుండు గడప, దొండ, దిద్దు మొదలగువానివంటి ధ్వన్యుచ్చారణమే.

4. గీతగోవిందమునకు 'శ్రుతిరంజని' యను వ్యాఖ్యచేసి తిరుమలదేవ రాయనికి సమర్పించిన లక్ష్మీధరుఁ డీపని చేసినాఁడు.

స్థాపింపలేరుగాని, ఉండుటకంటె లేకపోవుటయే యెక్కువ యను కొనుట స్వాభావికముగదా ? 'ఇట్లు ఇతరులు చేసిన పనిని తాము చేసినట్లు ప్రకటించుట యన్యాయమని, యధర్మమని ఆకాలపు రాజులకు తెలియదా ?' యని యడుగవచ్చును. తెలియ కేమి; కాని యీ న్యాయ ధర్మ చర్చను, రాజులు చేసినట్లు వెలసిన తక్కిన యన్ని పనులకును అన్వయించి చూచితిమేని ప్రత్యుత్తరము తేలును. 'విఠ్ఠల నాథ భూనాథుండు.........దుర్గము రచియించెను.'[1] అన్న శిలా శాసన వాక్యమున కర్థము అయన రాళ్ళు, మన్ను మోసి సొంత ముగా వడ్డెపని చేసి కోటగట్టినాఁడని యర్థము కాదుగదా ? 'కల్బరిగ నగర సగరపురవర పరివృఢ జవన యవన పృతన భవదసి నని దెగి కృష్ణరాయ' యని యాముక్తమాల్యద 'గ్రంథావతారికలో శిలా శాసనమువలె నుదాహరింపబడిన' వాక్యమున కర్థమేమి ? సైనికుల నందఱిని కల్లు త్రాఁగుచు తమాషా చూచుచుండుఁడని కూర్చుండఁ బెట్టి తా నొక్కఁడే రాయలు తురకసైన్యము నడుమఁ దూఱి ఒక్కొక్కరినిగా జుట్లను—తుమింపుఁడు ! గడ్డములను-బట్టి జొన్న కంకులను గోసినట్లు తలలను గోసి వరుసగా రాసి వేసెనని యర్థము చెప్పలేముగదా ! విఠ్ఠలరెడ్డి శంకుస్థాపన చేసియుండవచ్చును; రాయలును అందఱి నడుమ ఒకమారు తన కత్తియు నాడించి యుండిన యుండును. ఇట్లు నిజముగా పనిచేసి చచ్చినవారికిఁగాక కోటగట్టిన కీర్తి యతనికి, తురకలను జంపిన కీర్తి యితనికి రావచ్చు నఁట; అందులో అధర్మము లేదఁట ; కావ్యనిర్మాణమందుమాత్ర మంతే పనిచేసి యట్టి కీర్తిని సంపాదించుకొన్నప్పుడుమాత్రము వచ్చిన క్రొత్తయధర్మమేమి ? అన్యాయమేమి ? వడ్డెపని రాజులు చేయలేనిది గాదు; శత్రువుల నెదిరించి చంపుటయు వారు నేర్వవల సిన విద్యయే. అట్లే సాహిత్యాది విద్యలుగూడ. కాని రాజుల ధర్మము న్యాయమును ఆ విద్యలను పోషించుటయేకాని వానిలో నేదియొక్కటిగాని తలస్పర్శిగా నభ్యసించి సాటివారితో పోటాపోటీకి నిలుచుట కాదు. అన్ని విద్యలవారును జీవనార్థము, కీర్తికొఱకు తమ్మా శ్రయింతురు. కావున అందఱితోడను సంబంధముంచుకొనవలసి,

1. రాయచూరు శాసనము, కాకతీయసంచిక, అను. ౨౮ పుట.

రాజులకు ఎందును ఎప్పుడును ఐకాంత్యము సిద్ధించుట దుర్లభము. కొంతవరకు క్షేమకరము కాదుగూడ. అన్నివిద్యలును అభిమానింప వలసినవారు ఒకవిద్యయందు ప్రావీణ్యము, తత్ఫలమగు పక్షపాత మును సంపాదించుకొనుట, కొననిచ్చుట—నీతి విరోధమనుట ప్రాచీను లెఱిఁగి యాచరించిన తత్త్వము, కాఁబట్టియే రాజరచితములైన పనులను అన్యకర్తృకములుగా నూహించుట మనకు సహజమైనది. 'నన్నెచోడుఁడు, రఘునాథుఁడు, అనంతభూపాలుఁడు మొదలగు రాజకవుల నెవరిని శంకింపని విమర్శకులు బుద్ధారెడ్డి, కృష్ణదేవ రాయలనుమాత్రమే శంకించి వారి యశము నితరుల పరము చేయఁ జూచుట వింతలలో వింత'[1] అన్నారు లక్ష్మీకాంతముగారు. రఘునాథభూపాలుని తెలుఁగుకృతు లాయనవే కావచ్చును. అతని పేరనున్న 'సంగీతసుధ' యను సంస్కృతగ్రంథముమాత్రము తన తండ్రి గోవిందదీక్షితులు రచించినదని కుమారుఁడు వేంకటమఖి తన 'చతుర్దండీ ప్రకాశిక'[2] లో స్పష్టపఱచినాఁడు. నన్నెచోడుఁడు మొదలగు కొందఱు రాజకవులనుగూర్చి యిట్టివి మన కేమియు తెలియవు కావున నూరకున్నాము. కృష్ణరాయలు ఆముక్త మాల్యదను రచింపలేదేమో యని బలమైన సందేహ ముండుటకుఁ గారణములు సుప్రసిద్ధములే కాని రెడ్డిగారు చెప్పిన 'గూఢవాదములు' కావు.[3] చాలనాళ్ళుగా నట్టిప్రవాదముండుట, పెద్దన్న రచించినట్లు పలువురు వ్రాసియుండుట. శాసనములలోఁగాని, గ్రంథములలోఁ గాని యెందును—ఆముక్తమాల్యదతప్ప—రాయలు రచించినట్లు ఉల్లేఖము లేకపోవుట, రాయలపేరఁగల 'జాంబవతీ పరిణయము' మొదలగువానిలోని సంస్కృతరచనకును, ఆముక్తములోని దానికిని విస్పష్టమైన భేదముండుట ఈ హేతువులలోగల గూఢవాదమేమి? ఇవన్నియు 'పరోక్షము'లై, ఆముక్తమాల్యదలోఁ గల 'కృష్ణరాయ మహీరాణ్ణామాస్మదాముక్తమాల్యద' యను మాటమాత్రము 'ప్రత్యక్ష' సాక్ష్యమగునేమో నాకుఁ దెలియదు! మఱి మనుచరిత్ర కును, ఆముక్తమునకును శైలిలో అట్టిభేదము లేదా యన్నచో ఎవరును లేదనఁజాలరు. కాని సామ్యమును చాలఁగలదు. తేలిన

1. ల. కా. పీఠిక, పుట ౪. 2. వీణాప్రకరణమున. 3. అను. పీ. III

దేమి? విషయనిర్ణయము సందిగ్ధమనుటయే. కాంబట్టియే కొందఱు-నా వంటివారు—ఆముక్తములో పెద్దన్న కై వాడమునకుఁదోడు రాయల రచనయు—ఇంకొకరిని మఱెవ్వరిని పేర్కొన వీలులేదు గాన—కొంత కలసియుండవచ్చు ననుకొని యీ యాకాశపురాణమునకు స్వస్తి చెప్పుకొందురు; ఇప్పటి సామగ్రిలో ఈ విషయ మింతకన్న నికరముగా తెగుట సాధ్యముగాదు గావున. కనుక రంగనాథుఁడను నొకకవి యుండి యీ రామాయణము వ్రాసి బుద్ధరాజుపేరఁ బ్రకటించుట, దీని నెఱిఁగిన సమకాలికుల మూలమున దీనికి రంగనాథ రామాయణ మను పేరు నిలుచుటయు అసంభవములుగావు. మఱి బుద్ధరాజే రచించియుండుటయు అసాధ్యముగాదు. కొంతవఱకు అసంభవముని మాత్రము చెప్పకతప్పదేమో. అంతే కాని రంగనాథుఁడు 'కృత్రిమపురుషుఁ'డని రెడ్డిగారివలె దృఢముగా చాటుట నా చేతఁగాని పని. లేనివ్యక్తిని భావనచే సృజించి ఇందఱిలో నొక బుద్ధారెడ్డిమీఁదనే యేల పడవేయవలయునో, అందుచే నెవరికి తృప్తియో నా కర్థముకాని విషయము. ఈ మతమందు వారికిఁగల నిస్సంశయత్వము అనుబంధపీఠికలో ఈ గ్రంథమును 'గోనబుద్ధ రామాయణ' మనియే రెండు మూఁడు మార్లు వారు పేర్కొని యుండుటచే స్పష్టపడుచున్నది. కాని ఈ నూతన నామకరణమును ఆ పీఠిక మేరను దాఁటిపోనీయక ప్రాఁత పేరనే గ్రంథమును ప్రచురింప ననుమతియిచ్చి మన ధన్యవాదములకు వారు పాత్రులైనారు.

తమ యభిప్రాయమునకు సమర్థకముగా "హిందూసంఘము లోని జాతి మతాది వైషమ్యజనితభావములు ఇట్టికల్పనలకు నెంత మాత్రము ప్రేరేపకములో విచారింపనగును" అన్నారు రెడ్డిగారు.[1] జాతి మతాది వైషమ్యజనితభావములు మనుష్యసంఘనముకే సామాన్యధర్మములు. అవ్వి మనలోను గలవు. అంతేకాని యవి హిందూసంఘమునకే ప్రతినియతములు గావు. జాతియొక్కటి మాత్రము మనలో తక్కిన సంఘములకంటె కొంచెము ప్రబలముగా నున్నదనవచ్చును. దాని కెన్నో కారణములు. దాని ప్రాబల్యమును తగ్గించుటకై, రూపుమాపుటకై ఎందఱెందఱు,

1. అను. పీఠి. పుట ii

ఎప్పుడెప్పుడు, ఎన్నెన్నివిధముల ప్రయత్నము చేసి, చేయుచు ఉన్నారనుటయు, వారు సాధించిన సిద్ధులును, చెడిన చేటులును రహస్యవిషయములు గావు. హిందువుల తత్త్వ మతదృష్టుల పరిణామమును దిగి చూచినవారంద తెలుఁగుదురు. ఈ జాతి మత వైషమ్యముపాట తెలిసినవారును, తెలియనివారును అందఱును పాడి పాడి పాసినది. స్వార్థపరులగు పాశ్చాత్త్యులు కొందఱు దీనికి చిట్టవ్రాసి ప్రకటించిరి. స్వార్థ పరార్థములు రెండును గమనించు శక్తియుక్తులు లేని మనవారు దానిని భక్తితో అనుగానము చేయుచున్నారు! అంతేతప్ప జాతి మతముల యుద్దేశము, ఉపయోగము, ఫలము, వీనియందలి సదసత్త్వులను గమనించి, సత్తును సాధించి, అసత్తును అణఁగఁద్రొక్కుటకై త్యాగ యోగములను జూపు పౌరుషవంతులగు సంస్కర్తలు, అధికారులు మనలో నేఁడు చాల కొలఁదిమందియే కలరు. రెడ్డిగారు కొందఱిలో చేరకపోవుట మన దౌర్భాగ్యము. వట్టి దోషములనుమాత్రము దిట్టించి తిట్టఁపనికి వారికంటె అల్పాధికారులెందఱో కలరు. ఈ సందర్భమున విచారింపఁదగిన సంగతులని రెడ్డిగారిచ్చిన వానిలో మొదటిది చిత్తగింపుడు.[1]

అప్పకవి 'ధరణీసురుఁడు ప్రశాంతుఁడు...కవి యనఁ బరఁగున్' అని వ్రాసెను. దానికి "బ్రాహ్మణుఁడు తప్ప నితరుఁడు కవి గానేరఁడని జన్మనిరోధముఁ గల్పించినాఁ" డప్పకవి యని యన్వయమును వ్యతిరేకముగా నర్థము చేసికొనిరి రెడ్డిగారు. ఒక వేళ అప్పకవికే యీభావముండియుండె ననుకొందము. అతనికి పరమాచార్యత్వమిచ్చి శాసనమును శిరసావహించినవారు తెలుఁగువారిలో నెందఱు? రామరాజభూషణుని రామభద్రకవి యవమానపఱిచెనన్న కథ పేర్కొని అతనికన్న నితఁడు పూజ్యుఁడని జాతిప్రయుక్తముగా అప్పకవి స్తుతించినమాట వాస్తవము. కాని వసుచరిత్రకు పిల్లవసు చరిత్రములు వ్రాసినచో ధన్యుల మనుకొన్న వారిలో బ్రాహ్మణు లెందఱు? దానిని సంస్కృతమునకు పరివర్తించినవాఁడు బ్రాహ్మణుఁడుగాఁడా? నాఁటినుండి నేఁటివఱకు దాని నాంధ్ర పంచ కావ్యములలో నుత్తమముగా నెంచి బ్రహ్మరథముఁ బట్టినవారు

1. అను. పీఠి. పుట ii

బ్రాహ్మణులుగారా? ఇందటి మాటలకు, చేతలకు లేని విలువను ఒక యప్పకవిమాటకు రెడ్డిగారివంటి విజ్ఞులా యీయవలసినవారు?

నిజము చూడబోయిన పైని అప్పకవిమాటకు 'నానృషిః కురుతే కావ్యం' అను ప్రానుడి మూలము. ఋషి అనఁగా ధరణీసురుఁ డని తెలిఁగించుట స్థూలమైన పొరఁబాటు. దాని కర్థము జన్మబ్రాహ్మణుఁడని యతఁడు తలఁచియుండెనేని అది యంతకంటె పెద్దదోషము. 'నావిష్ణుః పృథివీపతిః' అనువాక్యము పైవాక్యము తరువాతది. దానికి ఎకరానేల పట్టాదారులందఱు శ్రీమహావిష్ణువు నవతారములని యర్థము చెప్పుటవలెనున్నది అప్పకవి తెలిఁగింపు. కాని 'ప్రశాంతుఁడు' అను విశేషణము వేయుటచే అప్పకవికి పై ఋషిశబ్దముయొక్క నిజమైన యర్థము కొంతయైనను తెలియక పోలేదని యూహింపవలసియున్నది. కవిత కత్తివంటిది. చంపఁ గలదు. బ్రదికింపఁగలదు. మనుష్యుల నదిదేవతలుగా సంస్కరింపఁగలదు; రాక్షసులను జేసి పడద్రోయగలదు. మనుష్య జాతిలో సౌహార్దము, భక్తి, త్యాగము, సత్యప్రీతి, ధర్మదృష్టి, ఆత్మసంయమము, సౌందర్యపారవశ్యము - ఇత్యాది మహాగుణము లిప్పటికిని నిలిచి యోగక్షేమసాధనములై యుండుటకు గంభీర భావములు, విశాలదృష్టియుఁగల మహాకవుల కావ్యములే మూలాధారములు; మీఁది కవచములు. కవి ప్రశాంతుఁడై, దాంతుఁడై ఋషితుల్యుఁడైనప్పుడుతప్ప అట్టి మహాకావ్యము రచింపలేఁడు. ఆ సంస్కారము లేనివాఁడు తలలోని క్రుళ్ళంతయు వెడలఁ గ్రక్కి తన్ను, ఇతరులను మైలపఱుచునంతే. చిత్తోద్రేకమును హద్దులో పెట్టుకొనలేనివారి యిట్టి కావ్యాభాసములు నాఁటికి నేఁటికి నన్నిజాతులలోను గలవు. కనుక కవిత్వమునకు ఋషిత్వము బీజమేని అది బ్రాహ్మణధర్మము; బ్రాహ్మణజన్మము గాదు. రామాయణమున లేకున్నను, ఆదికవి వాల్మీకి అసలు బోయవాఁడను కథను ప్రచారమునకుఁ దెచ్చి మన ప్రాచీను లీ తత్త్వమునే స్పష్టపఱచిరి. జన్మ కర్మ సిద్ధములగు కొన్ని యనుకూలములచే బ్రాహ్మణజాతిలో జనించినవారికి ఆధర్మమును సాధించుట కొంత సుకరము కాఁబోలు. జాతితత్త్వ మింతే. కాఁబట్టి మనలో 'కవులెల్లరును బ్రాహ్మణులుగాఁ

బుట్టిరయే తీరవలయును ?' అన్న రెడ్డిగారివిస్మయము విపరీతదృష్టి ఫలము.

'బ్రాహ్మణకవులు శూద్రకవులను సకృత్తుగాఁదప్ప స్తుతింప కుండుటకు' కారణము మనలో 'ఎక్కువజాతివాఁడు తక్కువజాతి వానిని స్తుతింపఁగూడదు' అను నియమమే కదా యని రెడ్డిగారన్న మాట[1] సత్యమే. కాని ఎక్కువ తక్కువ యను భావము లున్నంత కాలము స్తుతులు, నమస్కారములు ఎక్కువవారికి తక్కువవారు చేయుట స్వభావము; చేయవలయుట ధర్మము. ఆ సంకేతముల కీసం కేతములు స్మారకములు. దీనికి విపరీతముగా ఎక్కువవారు తక్కువ వారికి అట్టి మర్యాద చూపుట వ్యక్తిగతమైన యౌదార్యమునకు గుర్తు. కాని సామాన్య న్యాయము కాదు; కాఁజాలదు. ఈ న్యాయ మును మనము ఏవిషయమందు వదలఁగలిగినాము ? జాతి విషయ మందుమాత్రమ ఇది దోషమై తక్కినవానిలో కాకపోవునా ? ఈ గ్రంథమును సవరించు, ముద్రించు పనిలో నుపకరించిన యందఱిలో ప్రభాకరశాస్త్రి, లక్ష్మీకాంతుఁడు, సోమశేఖరుఁడు[2] అను ముగ్గురిని మాత్రము వందనసమర్పణకై రెడ్డిగారు ప్రత్యేకించుట పై న్యాయము నకేకదా ఉదాహరణము ? ఆ జాతిభేదమునకు జన్మమైనచో ఈ జాతిభేదమునకు జీతము కారణము. ఇంతేకదా ? పోనిండు. బ్రాహ్మణేతరకవులు చేసిన కవిస్తుతులలో ఈదోషము లేదా ? నన్నిచోడుఁడు బుద్ధారెడ్డి, భట్టుమూర్తి మొదలగువారే యే బ్రాహ్మణేతరకవులను స్తుతించినారు ? మఱియు బ్రాహ్మణులు పొగడి పొగడి పెద్దచేసిన రాజులు, పాళెయగాండ్లు అందఱును బ్రాహ్మణేతరులేకదా !' కనుక పూజా పురస్కారములు బహిరంగ ముగా జరుగుటకు ఏసంఘమందుఁగాని, యేకాలమందుఁగాని చేయించుకొనువారి విధాయకత్వమును, చేయువారి విధేయత్వమును ముఖ్యసాధనములంతే. అంతరంగపూజమాట వేఱు. అది ఆత్మ సాక్షికము. దానికి ఏభేదమును పనికిరాదు.

1. అను. పీ. పుట ii. 2. అదేపుట i ఏకవచన ప్రయోగము అను వాదము గనుక క్షంతవ్యుఁడను. రెడ్డిగారి సామ్యవాదము ఆత్మాన్వయి కాదనుట కిది యొక గుర్తు.

జాతివంటిదే మతముగూడ. కాని సాహిత్యము మొదలగు విశ్వజనీనవిషయములందు దానిశక్తి రెడ్డిగా రనుకొన్నంత ప్రబలముగా పనిచేసినట్లు నాకుఁ దోఁపదు. "పాల్కురికి సోమనాథుఁడు మొదలైన యుత్తమకవులకు స్తుతిపాఠములలో పేరులేకుండుటకు మతభేదముతప్ప వేఱు హేతువులున్నవా?" యని రెడ్డిగారి ప్రశ్న. ఉన్నవని నా మనవి. ముఖ్యమైనది అతఁడు 'ప్రశాంతుఁడు' కాకపోవుటయే. అతనిది అణఁపరాని యుద్రేకము. అది అతని శైవాభిమానమందును, ఇతరావమానమందును మితిమీఱి యసహ్యమైనది. భావబలమే లేని వట్టి శుష్కకల్పనలతో నిండిన మన ప్రబంధాలవంటివి చదివి చప్పిడిపడిన కొందఱిని ఈతని గ్రంథములు మొదలుమొదలు ఆవకాయవలె ఆకర్షించును. ఇఁక శివశైవభక్తి గలవారిమాట చెప్పఁబనిలేదు.

> "పశుపాశపతియుండఁ బశువులా పంద
> పశుజీవులకుఁ బెట్టు పందలఁ బట్టి
> సోడంబుతో ముక్కు సూటిగాఁగోసి
> కూడ నిట్టికఁ బ్రామ కేడఁబోవచ్చు?"[1]

అనునది వాని యాక్రోశమునకు మచ్చు. ఇట్టివి కుప్పలు. అతని నట్టిపని చేయనిచ్చుట కేకాలమందును, ఏసంఘమును అంగీకరింపదుగావున 'ఏడఁబోవచ్చు' నను ఆతని ప్రశ్నకు 'నీ యిష్టము వచ్చిన చోటికిఁ బొమ్మ'ని చెప్పి తెలుఁగు సహృదయులు పెడమొగముఁబెట్టి యూరకున్నారు.' ఈ యుద్రేకపు టూకదంపులకు తోడుగ దిక్కుదెస, తల తోఁక లేని పవాడముల పునరుక్తులతో సోమనాథుని గ్రంథములు నిండినవి. అంతేకాని మతభేదము కారణము గాదు. శైలిలో ధారాళత, భావముల యార్జవము మొదలగు కావ్యగుణము లెక్కువగా నున్నవి. కావుననే యాతని కావ్యముల కింతమాత్రమైనను గౌరవము నిలిచినది. ఆముక్తమాల్యద మొదలగు వైష్ణవగ్రంథములలోను ఇట్టి పరమతతిరస్కారము, స్వమతభక్తియు నున్నను అవి సోముని మట్టమున కెక్కలేవు. ఆ కవుల

1. బసవపురాణము, ఆ. ౭. పుట ౨౭౦.

చిత్తవృత్తి కావ్యసామాన్యములగు ఇతరవిషయముల చిత్రణమున విశాలముగా వెలసినది. కాళిదాసు శివారాధకుఁడు. శ్రీనాథాదులును అట్లే. తిక్కన హరిహరాద్వైతోపాసకుఁడు. అట్లని వారి గ్రంథములను చదివికొనక విడిచిన యితరు లెవరు ? మతములను గూర్చి యెవరి పిచ్చి వారిది. కొంతవఱకును అది ఇతరులకును ఆనందమే యగును. కాని అది పూర్తిగా ముదిరి ఇతరులను రాళ్ళ అప్పలతోఁ గొట్ట మొదలుపెట్టినప్పుడు చిన్నింటిలోఁ ద్రోసి చిలుకు వేయుట తప్పనిపని. పాల్కురికి సోమనాథుఁ డుత్తమోత్తమకవి యని మన మింకను అనుకొనుట కర్థమేమనగా, మన కావ్యరసానుభవ సంస్కారము ఎక్కవలసిన మెట్లింకను గొన్ని కలవనుటయే. నన్ని చోడుఁడు మహాకవి. సోమనాథునికన్న గొప్పవాడు. కాని అతఁడు "మన కవులయొక్క పూర్వకవిస్తుతులలో నిర్నాముఁడు"గా నుండుటకు కారణము 'అతని సాహిత్యమందలి యనాదరణ' యుఁగాదు, 'మతభేదమును'[1] గాదు. మఱి యాకస్మికములగు చారిత్రక హేతువులచే, తక్కిన యెందఱో మహాకవులవలె, అతని గ్రంథము లందుఁబాటులో లేకపోవుటయే యనుకొనుచున్నాను. సారంగపాణి పదములకు వచ్చినంత వ్యాప్తి తాళ్ళపాకవారి కీర్తనలకు రాలేదు. కారణ మిట్టిదేతప్ప, ప్రజలలోని వైష్ణవద్వేషము కాని, ఆ రచనల నిర్గుణత్వముగాని కాదుగదా ? ధూర్జటి 'సుకుమార వారవనితాధర' పానకథ సత్యమేని, అది తెనాలివాని మధ్య వైష్ణవపు మహత్తు గావచ్చును. అట్లే ఆ మహాశైవుని యాచార స్వరూపమైనను గావచ్చును. వైష్ణవునికి మత్సరముండవచ్చునఁట, శైవునికి కామమేల యుండరాదు ? మఱియు బసవేశ్వరుఁడు పోషించిన పన్రెండువేల మిండజంగాల కథలవంటివి చూచినచో, కాము పురుషార్థవిషయమున, వేశ్యాసహవాసవిషయమున, ఇతరుల దృష్టికన్న శైవుల దృష్టి కొంతభిన్నముగా, ఉదారముగా నుండునని మనకు తోఁపకతప్పదు. శివభక్తి యన్ని పాపములకును ప్రాయశ్చిత్తము. ఇంతేకాదు—

1. అను. పీఠి. పుట II

"శూలి భక్తాలి దుశ్శీలముల్‌గన్న
మేలకాఁ గైకొనుమీ బసవన్న!"[1]

అని బసవేశ్వరునికి గురుదేవాజ్ఞ. కాఁబట్టి ధూర్జటి యొక వేళ వేశ్యాలోలుఁడై యుండెనన్నది సత్యమే యనుకొన్నచో కాఁగల సర్వనాశనమేమియు లేదు. ఇట్లే కృష్ణదేవరాయలు దాసీపుత్రుఁడను ప్రవాద మొకప్రక్కనుండఁగా, అతఁడు సాహిత్యసార్వ మండలాంతర్వర్తి శ్రీమన్నారాయణుఁడే యని పొగడిన కవులకు, ఆ పద్యములు పారాయణముచేయు తెలుఁగువారికి ఆముక్తమాల్యద ఆయన చేసినదని చెప్పవలసివచ్చినప్పుడుమాత్రము ఆతఁడు 'ధరణీసురుఁడు' కాఁడను తెలివి యడ్డమగునా ?

ఈ వాదమును ముగించుచు రెడ్డిగారు "ఆ ప్రాచీన విషమ దర్శిత్వము నేఁడు లేదు. మన సంఘము మాఱినది. గుణమునుబట్టి పోవుదుముగాని కులగోత్రములఁబట్టి కాదు"[2] అని యొక గొప్ప నమ్మికమాట చెప్పినారు. వారి యనుభవమును, అధికారమును నావానికన్న ఎన్నింతలో పెద్దవి. ఈ వాదములో కానవచ్చునంత కంటె ఎక్కువ సమదర్శిత్వమును, జాతిప్రయుక్తముగాక గుణ ప్రయుక్తమైన పక్షపాతమును వారు జీవితమందు చూడఁగల్గి, చూపఁగల్గి యుండిరేని వారిని గౌరవించు మిత్రులలో నాకంటె ఎక్కువ సంతసించువాఁడు లేఁడు. ప్రాచీనుల దర్శిత్వము సమమో, విషమమో యది ప్రాఁతకథ. దానిని సరిగా చూచుటకు కావలసిన ప్రత్యగ్దర్శిత్వము నిచ్చు సులోచనములు రెడ్డిగారింకను ధరింపలేదు.

ఈ రామాయణములో పేర్కొనఁబడిన బుద్ధారెడ్డియే నిజమైన దాని కర్తగాని వ్యవహారమందలి రంగనాథుఁడు కాఁడను రెడ్డిగారి దృఢసిద్ధాంతమే యింత యీ గందరగోళమునకు మూలము. అంత నికరముగా ఆమాట చెప్పుటకు చారిత్రికదృష్టి కధికారము చాలదనియు, ప్రాయోభావము రంగనాథుని కర్తృత్వముప్రక్కనే ముల్లుచూపుచున్నదనియు నా మనవి. ఈ విషయము నిర్ణయించుటలో ఎవరి బ్రాహ్మణత్వముగాని, ఎవరి రెడ్డిత్వముగాని చనవు చూపరాదు.

1. బస. పు. ఆ. ౧. పుట ౨౫, 2. అను. పీఠి. పుట III

దీనినుండి మనము వెనుక సూచించిన రెండవ ప్రశ్నకు—ఇతర కవులచే స్తుతింపఁబడిన రంగనాథుఁడే యితఁడా యనుదానికి—మరలవచ్చును. ఇక్కడఁగూడ ప్రామాణ్యాభావముచే తృప్తిపడజాలమేని ఉన్నకథకు మఱికొన్ని కాళ్ళు కల్పించుటతప్ప వేఱేమియు చేయలేము. లక్ష్మీకాంతముగారి పీఠికలో ఆపనియే జరిగినది. ఈ గ్రంథము వ్రాసినవాఁడు మహాకవి యగుట, అతని పేరుగలవానిని ప్రాచీన మహాకవులలోనివానిగా నితరులు స్తుతించియుండుట, ఈ గ్రంథమును రంగనాథుఁడు వ్రాసెనని కొందఱు లాక్షణికులు వచించుట — ఈ సాధనములు అతఁడే యితఁడను నూహకు, నమ్మకకు చాలును. చాలదనువారు ఇంతకుమించి చేయఁగల్గిన దేమియు లేదు. మఱియు ఇతఁడు కాఁడను నమ్మకకు మీకు మాత్ర మింతమాత్రపు సాక్ష్యమైనను గలదా? ఇదే చిత్తవృత్తితో శాసనములందలి బుద్ధారెడ్డి యీ రామాయణపు బుద్ధారెడ్డి కాఁడని వాదించినచో ప్రత్యుత్తరము గలదా? లాక్షణికులకు చరిత్రజ్ఞానము మట్టమని వాదించువారు శాసనములందలి అనన్వితవిషయము లెన్నో కలవే వానిని గమనింపఁబనిలేదా? తన తండ్రిపేరు విఠ్ఠలుఁడని బుద్ధరాజు చెప్పినదానికి విరుద్ధముఁగా బుద్ధరాజుకొడుకులే తమ తాత పేరు గన్నారెడ్డియని పేర్కొనఁగా, రెండుపేళ్ళును ఒకనివే కావచ్చునని, ఒకఁడు పెంపుడుతండ్రి, మఱియొకఁడు కన్నతండ్రియుఁ గాఁబోలునని ఏదో యొక విధముఁగా సవరించుకొన్న యుదారత కొంత యీ రంగనాథునిమీఁదను జూపియుండరాదా? ఇది 'బోడి తలకు మోఁకాలికి ముడివెట్టుట' వంటి దన్నారు. లక్ష్మీకాంతము గారు. కాని బోడితలయైనను తలయే, మోఁకాలును కాలే. ఈ రెండును లేక వారు వేసిన యీ ఆకసపుముడి చిత్తగింపుడు; బుద్ధరాజు తండ్రిపేరు విఠ్ఠలరాజు. తండ్రి నాపేర రామాయణము వెలయింపుమని యాజ్ఞ చేయఁగా కొడుకు అట్లే ప్రతిజ్ఞచేసి రచించెనను మాట గ్రంథగతము. అనఁగా అర్థ మేమఁట! విఠ్ఠల రాజుపేరు పాండురంగవిఠ్ఠలనాథుఁడై యుండవచ్చును. దానిలోనివి 'కర్ణపేయము'లని రెండవ నాల్గవ పదములనుమాత్రము కొడుకు కత్తిరించి తీసి తన గ్రంథమున కతికించి 'రంగనాథరామాయణ' మను

పేర వెలయించియుండును-అనుట. ఈ సలహా విక్రమ సంవత్సర శ్రావణమాసపు 'భారతి'లో శ్రీ వావిలాల వెంకటేశ్వర శాస్త్రిగారు జేసిన దాని యనువాదము. అంగీకారము.[1] విఠ్ఠల శబ్దమే విష్ణు శబ్దభవము. దానికి నాథపదము చేరనక్కఱలేదు. ఒకవేళ చేర్పవచ్చినను కొడుకు తండ్రిని విఠ్ఠలధరణీశుఁడు, విఠ్ఠలక్ష్మాపాలుఁడు ఇత్యాదిగానే వ్యవహరించినాఁడుగాని 'విఠలనాథ' నామధేయము చూపలేదు. దానికి పాండురంగశబ్దము వేఱు అతికించి, అందలి ౨-౪ పదములనుమాత్రము విడఁదీసి తన గ్రంథముపేరుతో చేర్చి, తండ్రి పేరు నిలిపినా ననుకొనెడు కొడుకు సంతోషము నా కర్థముకానిది. అదే నిజమేని ఆమాత్రపుమాట యింత పెద్ద గ్రంథములో ఎక్కడ నైనను వ్రాయకపోయెనా? ఇది యితరుల యూహకు వదలవలసిన విషయమా?

ఐన నీరామాయణమునకు కర్తపెట్టిన పేరేమి? నాకుఁ జూడఁగా గ్రంథమందున్నట్లు వట్టి 'రామాయణ' మనియే. ఎఱ్ఱన్న రామాయణమును, పోతన్న భాగవతమును ఇట్టి నిర్విశేషణ నామధేయములతోనే వెలయుచున్నవి. అట్లే బుద్ధారెడ్డికిఁగాని, రంగనాథునికిఁగాని ఇతరరామాయణ వ్యవచ్ఛేదము చేయ నక్కఱ కలుగలేదని తలఁపవచ్చును. మఱి యీ రంగనాథరామాయణ మను పే రెవ్వరుపెట్టిరి? కర్తగాని, యుత్తరకాండము వ్రాసిన బుద్ధారెడ్డి కొడుకులుగాని ఆ పే రెక్కడను సూచింపలేదు. వారే ఆపేరు పెట్టినారని లక్ష్మీకాంతముగారన్నమాట నిరాధారము.[2] వ్యవహారములో అనుకూలమునకై యెవరో ఎప్పుడో పెట్టియుండ రాదేమి? శిశుపాలవధమునకు మాఘుమని, కిరాతార్జునీయమునకు భారవియని గ్రంథకర్తలే మాఱుపేళ్ళు పెట్టలేదుగదా? తరువాతనే గదా వచ్చియుండవలెను? ఆముక్తమాల్యదకు విష్ణుచిత్తీయమనికూడ పేరు వాడుకలోనున్నదే! అదిగూడ కర్తపెట్టినదే యందురా? అందు కాధారమేమి? కాఁబట్టి దీనికి రంగనాథరామాయణమనునది

1. చూ: రంగనాథ రామాయణమును గూర్చినవ్యాసము.

2. ల. కా. పీఠిక, పుట ౧,౩.

నడుమంత్రపు పేరు గావచ్చును. ఇట్లనుకొనుటలో 'సాహస' మేమియును లేదు. మఱి రెడ్డిగారి వెంబడి 'రంగనాథ రామాయణము రంగనాథకృతము కాదు'[1] అను లక్ష్మీకాంతముగారి ప్రతిజ్ఞయే సాహస మనక తీరదు.

లక్ష్మీకాంతముగారు ఈబుద్ధారెడ్డి కాలమును శాసనాద్యాధారములచేత చక్కఁగా, సంగ్రహముగా చర్చించి ౧౩-వ క్రీస్తు శకపు మధ్యమని నిర్ణయించినారు. ఇప్పటి సామగ్రిలో ఈ యూహ యుచితమే. కాని తిక్కనకన్న సుమా రిరువది సంవత్సరములు మొదటఁబుట్టిన దీ గ్రంథమని యెంచుటకు తగిన యాధారములు లేవు. దీని యారు కాండల ద్విపదను చదివియే తిక్కన నిర్వచనోత్తర రామాయణమును ద్విపదగా వ్రాయక, పద్యకావ్యముగా వ్రాసి సప్తకాండిని పూర్తి చేసెనను లక్ష్మీకాంతముగారి యూహ కొంత వఱకు సాగఁదీసినది.[2]

ఈపీఠికలలో ఇవిగాక కర్తలిద్దఱును చేసిన కొన్ని వింత సిద్ధాంతములున్నవి ఆంధ్రులలో ద్వైవిధ్యము, ఆర్య ద్రావిడ వ్యవహారము, వాల్మీకి రంగనాథుల పాత్రపోషణవివేచనము, రామాయణకథలోని 'సంశయాస్పద' వృత్తాంతములు మొదలగునవి. మఱియొకప్పుడు వానిని చర్చింతును.

1. ల. కా. పీఠిక, పుట ౬.
2. అదే పుట ౬.

# ఆంధ్రవాఙ్మయమున

# నాచన సోమనాథుని క్రియఁదగిన స్థానము

## ౬

నాచన సోముని కవిత్వముఁ జర్చించుచు పై పేరుతో నేను కొన్నియేండ్ల క్రిందట వ్రాసిన వ్యాస మాంధ్రదేశీయ పండితుల కనేకుల కాందోళనముఁ గల్గించినది. శ్రీ శతావధాని వేలూరి శివరామశాస్త్రిలుగారు, ఉకుమళ్ళ అచ్యుతరావుగారు, దుర్భా సుబ్రహ్మణ్యశర్మగారు, నడకుదిటి వీరరాజుపంతులుగారు మొదలగు వారు పై విషయమును జాలఁ జర్చించిరి. శివరామశాస్త్రిగారు 'నాచన సోముఁ' డను గ్రంథమున నతని గుణదోషముల రెంటిని జర్చించి మధ్యమణిన్యాయము వహించిరి. అచ్యుతరావుగా రాంధ్ర సాహిత్య పరిషత్పత్రికలో సోముని జాలఁబొగడి నా సిద్ధాంతము (సోముని కవిత యెట్టిన కవితకన్నఁ గొఱత యను విషయము) ఖండింపఁ దగినదనిమాత్రము వచించి యుదాసీనులైరి. దుర్భా సుబ్రహ్మణ్యశర్మగారును నా సిద్ధాంతమును సమగ్రముగా ఖండించుచు గొన్నాళ్ళక్రింద నెల్లూరిలో నుపన్యసించిరఁట. శ్రీ వీరరాజుగారు విమర్శరూపముగ నొక గొప్పగ్రంథమే వ్రాసినారఁట. కాని, యందలి కొంతభాగముమాత్రమే కడచిన (సిద్ధార్థి) సంవత్సరాది సంచికలోఁ బ్రకటించిరి. సోమునికన్న నెట్టన మేలను నామతము నంగీకరించినవారు శ్రీ నాగపూడి కుప్పుస్వామయ్యగారొక్కరే యిది వఱకు నాకుఁ గానవచ్చినవారు.

నేను వ్రాసిన నలుబదిరెండుపుటల వ్యాసమందు ప్రత్యక్షరమును ఖండనీయమని తలఁచినవారు వీరరాజుగారు. అందు లోపములనేకములు గలవని నే నెఱుఁగుదును. కాని వీరరాజుగారు తలఁచినట్లు దోషములు తప్ప మఱేమియు నందు లేదని తలఁపవలసినంత యక్కర నా కింకను దోఁపలేదు. శ్రీ శివరామ శాస్త్రిలుగారు నాయందలి లోపములను జూపుటయేగాక, గ్రహణీయమైన విషయ

ములనుగూడ మఱుఁగులేక యంగీకరించిరి. శ్రీ వీరరాజుగారి సంపూర్ణగ్రంథము బైలువడువఱకును నే నూరకుండవలసినదే. కాని, వారి ఖండన ఖండముఁ జదివినతరువాత వారి విమర్శన మార్గము గుణపక్షపాతముగలది కాదని స్పష్టమై యింతకన్న గ్రంథములో నేర్చుకొనవలసినదేమియు నుండదని నే నూహింపవలసెను. కావున నేను వ్రాయవలసినదంతయు నిప్పుడే సాధ్యమైనంత సంగ్రహముగా వ్రాయఁగలను.

మొదలు ఫల్గు, పరంధామ శబ్దములగూర్చి నా పొరఁబాటు తెలిపినందుకు వారికిఁ గృతజ్ఞుఁడనై వందనము లర్పించుచున్నాను. పై విషయము మొదలే తెలిపిరి గాన శ్రీ శివరామ శాస్త్రిలును నాకు వంద్యులు. బలరాముని గదుఁడను పేర సోముఁడు వ్యవహరించి నందుకు వా రిచ్చిన సమాధానము తృప్తికరముగాదు. బలభద్రునిచేత నంతకుమున్న 'ఈషాదండ' మున్నట్లు సోముఁడు వర్ణించెనేగాని గద యతనిచేత నున్నట్లెప్పుడును జెప్పలేదు. కావున 'గదుండు సగదుండై గదాధరున కిట్లనియె' నిత్యాది స్థలముల 'గదగలవాఁ'డని వ్యుత్పత్తిని గల్పించినను, సోముఁడు 'భాషాభూషణుఁడు' కాఁగలడేమోగాని, బలరాముఁడుమాత్రము 'గదుఁ'డగుట కష్టము. పోనిండు. పై పొరబాటు లొకవేళ నేఁజేయకుండినను, నా వ్యాసము నిర్దుష్టము గానేరదు. అందలి యభిప్రాయములు కొన్ని నా యిప్పటి రుచికి విరుద్ధముగా నున్నవి. నాచన సోముఁ డెఱ్ఱనకన్న నొకవన్నె తక్కువయను నా మత మిప్పటికిని మాఱలేదు. కాని, నే నతనికిఁ జూపఁవలసినంత గౌరవము నావ్యాసమునఁ జూపనైతినని చింతింపవలసియున్నాను.

శ్రీ వీరరాజుగారి మొదటిశంక, 'ఆంధ్రభాషాభివర్ధనీ సమాజము' వా రింత దోషపుంజమగు వ్యాసము నెట్లు బహూకరించిరి ? యని. బహుమాన మేర్పఱిచినపిదప నందుకై వచ్చిన వ్యాసములలో మేలైనదని పరీక్షకులకు దోఁచినదానిని బహుమానించుట సంప్రదాయమేకదా ! వచ్చిన వ్యాసములలో మేలన్నారుగాని యన్నివిషయముల మేలని వారు తలంపలేదని నా నమ్మిక. మఱియు నా వ్యాసము బహూకరించిన పండితులలో శ్రీ వావిలకొలను

సుబ్బారావుగారు, జయంతి రామయ్యపంతులుగారు, మానవల్లి రామకృష్ణకవిగారును గలరని విన్నాను. వీరిలో నెవరుగాని నా మతమును నేటికి నంగీకరించినట్లు లేదు. ఈ విషయముపై సమాజపుఁ గార్యదర్శులును సోమపక్షపాతులునగు శ్రీ కురుగంటి సీతారామయ్యగారు వచించిరి. పై విషయము తెలియఁగక శ్రీ వీరరాజుగారు నాయందు వారికిఁ దోఁచిన యపాండిత్యము బహుమతిని గాంచుటకు సమాజపండితుల యపాండిత్యమే ప్రధానకారణమని యొక యన్యాయపుటూహను బైలుదేర్చిరి! పై మూవురి పాండిత్యము నాంధ్రలోకమంతయు చక్కఁగ నెఱిఁగియేయున్నది. కావున నేఁడు నేను వారిపక్షము వహించి స్థాపింపవలసినది లేదు. 'ఆంధ్రభాషాభివర్ధనీ సమాజము' అను నామధేయమున మొదటి పదము స్త్రీలింగముగాను, రెండవది పుంలింగముగాను ఉండుటచే విశేషణ విశేష్యములకు సమానలింగకత్వము లేమి తప్పనియు, నదియే పై సమాజ పండితుల పాండిత్యాభాసమును వెల్లడించు ననియు వీరరాజుగా రనిరి; కాని, 'తింత్రిణీవృక్షము' ఇత్యాది ప్రయోగములందువలె, పూర్వపదము సంజ్ఞయనియు, నియతలింగకమనియు, కావుననే 'వర్ధనసమాజ' మని పుంవద్భావము రాక 'వర్ధనీ సమాజ' మనియే యుంపఁబడినదనియుఁ బంతులుగారు నిదానించి చూచియుండిరేని పై ప్రయోగము, వారి 'మహదానంద' మను ప్రయోగముకన్న వేయింతలు సాధువని గ్రహించియుందురు. సంజ్ఞ మనమే కల్పించినది. కావున సమాజపదమునకు దగినట్లుగా 'వర్ధన' సమాజమనియే యేల పేరుంచి యుండఁగూడ దందురేమో! నామధేయములలో స్త్రీలింగపదములందున్న రుచి పుంపదములయందుండమికి మానవ మనోధర్మము ప్రమాణము. ఐన 'సమాజ'మునకు బదులుగా 'సభ' యుండిన నీ కష్టము లేదే యందురేని, సభా సమాజ పదముల కర్థమందుఁగల భేదము వా రెఱుఁగనిదిగాదు. ఇట్లే 'కాశ్మీర' పదమునకు నాకర్థము కాలేదని వ్రాయుట వారి ముఖ్యోద్దేశము సరిగదా, నాతోఁబాటు సమాజపండితులకును కాలేదనిరి. కాశ్మీర మనఁగాఁ జందనమంటిని. కలపము, తత్సాధనముగూడఁ జందన శబ్దమున మేము వాడుదుము. అత్తరు బిళ్ళలు రాచిన

పన్నీటికిఁగూడఁ జందనమని యిందలి వాడుక, పై శబ్దమును గూర్చిన నా యాక్షేప మల్పమనియు, నేఁ జేయరానిదనియుఁ బంతులుగారితో నంగీకరించుటకు నా యభ్యంతరము లేదు. నేను ప్రయోగించిన 'పైననే' శబ్దముపై వారి యాక్షేపమ నిట్టిదే. అల్లన, మెల్లన, లోన, నెట్టిన యిత్యాది కళలన్నియుఁ బ్రకృతము ద్రుతాంతముగా మాఱినవి. 'పైన' గూడ నట్టిదే. 'నఱకెందత్రిపురంబు నంబుధము లోనం దోఁచు,' అని సోముని ప్రయోగము. 'పొడవు' 'పొడుపు' రెండును వ్యవహారమున సామాన్యములు.

పోనిండు. కవిత్వ మర్మములను బరిశీలింపఁగా సోముని కన్న నెఱ్ఱన యుత్తముఁడని నేనును, కాదు సోముఁ డుత్తముఁడని పంతులుగారును వాదించుచున్నాము. అసలు ప్రాచీనమహా కవుల నొకరితో నొకరిని పోల్చుటయే యసంగతమని కొందఱు పండితులు తలఁచెదరు. కాని నా కా మతముపై గౌరవము లేదు. భరతఖండమును పాలించి ధర్మస్థాపన సేయుటమాత్రము చూచి తిమేని, చంద్రగుప్తుఁడును కృష్ణదేవరాయలును తుల్యగౌరవార్హులే; కాని, వారిరువురిలోఁ గల భేదము గమనించి—రాయల కన్న గుప్తుఁడు గొప్పవాఁడని యెవరన్నను, అది రాయల నగౌరవ పఱచినట్లు తెలియఁదగునా? తాతగారు గొప్ప పండితులన్న మాత్రాన కుమారుఁడు తండ్రి నవమానించిన ట్లాయెనా? అట్లే యెఱ్ఱన సోమనల కిరువురకును తెనుఁగుజాతియే యప్పుపడి యున్నది. వారిపేరు చెప్పుకొని బ్రతుకవలసియున్నది. కాని, వా రిరువురిలో నెవరికన్న నెవరు గొప్పవారని సకారణముగఁ దలఁచినను ఇతరుని యెడ గౌరవమున కేలోపము నుండదు. మఱియు 'సోమునికి వాఙ్మయమున నిట్టిచోటని యిచ్చునధికారము మన కెక్కడిది?' యని పంతులుగారి యాక్షేపము. 'తిక్కనను కవిబ్రహ్మ' యని వినుతించిన యెఱ్ఱన కీ యధికారము ఎక్కడిది? 'వాణి నా రాణి' యని పినవీర భద్రుఁడు మఱుఁగు మర్యాద లేక చాటినమాత్రాన, మనమందఱము నతని యోగ్యతాయోగ్యతల విచారింపక తలవంచుకొని, 'పిన వీరభద్రుఁడు మాతాత' యని యంగీకరింపవలసినదేనా? సోముఁడు గొప్పవాడని చెప్పుట కధికార మెవ్వరిచ్చిరో, కాఁడని చెప్పుటకును

వారే యీఁగలరు. మఱియు నిట్టివిషయములందు పెద్దలవాక్యమునే ప్రమాణముగాఁ గొనవలయునని వారు వాదించునట్లు తోఁచెడిని. నా కంత వినయము లేదు. అంతమాత్రమునఁ బెద్దల నగౌరవించితినని తలఁపరాదు. 'గొప్పవారిని గౌరవించుటకు వారి సిద్ధాంతములను విమర్శించుటయే యుత్తమ మార్గ' మని యొకానొక పండితుఁడు వచించిన వాక్యమందు నాకుఁ జాలనమ్మిక గలదు. శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు, వీరేశలింగము పంతులుగారు మొదలగువారు నాచన సోముని మేడపై కెక్కించిరన్నమాత్రమున నాంధ్రలోక మంతయు వారి పల్లవినే యనువదింపవలయునా ? మఱియు రామ కృష్ణకవిగారు, వీరేశలింగము పంతులుగారు మొదలగువా రసాధారణ పండితులైనను, వారి పాండిత్యమందుఁగాని కార్యనిర్వాహణశక్తి యందుఁగాని మావంటివారికి నూఱవపాలును లేకున్నను, ఇట్టి విష యముల నావంటివానికి వారివాక్యములే ప్రమాణములు కానేరవు. వారు చరిత్రశోధకులు; ప్రాఁతవానికంటెఁ గ్రొత్తవానియందు వారి కభిమానమెక్కువ. నూతనగ్రంథములను సంపాదించి యాంధ్ర వాఙ్మయము నభివృద్ధిపఱచుటకును, మఱపులో మునిఁగిన మహా కవులను బైలువఱచుటకును వారు చాల పరిశ్రమించుచున్నారు. ఏదైన నూతనవిషయము లభించెనేని దానిగుణముఁ గొండంత చేసి, యందఱును దాని నెఱుఁగునట్లు చేయువారు తత్త్వదృష్టికన్న నభిమానము చరిత్ర శోధకుల పొగడ్తలకు వన్నెపెట్టును. నన్ని చోడుని కుమారసంభవము బైటికిఁ దీసినపుడు శ్రీ కవిగారు 'రాజ కవులలోను, కవిరాజులలోను ఇంతటివాడు లేఁ'డని గంట వాయించిరి. సోముని గ్రంథము వెలువఱచినప్పుడు వీరేశలింగముగారు నట్లే పొగడిరి. కుప్పలు కుప్పలుగా వెడలు పనికిరాని ప్రబంధములు, శతక ములు మొదలగువానినే చూచి చూచి రోసిన యితరపండితులు నిట్టి యుత్తమజాతి గ్రంథములు బైలువడఁగా ఆఱడుగుల పొడవు గల మనుష్యుని జూచి టెంకాయప్రమాణపొడవుగా నున్నాఁడురా యనిన 'ఔనురా' యని మనమందఱ మనునట్లే ఇట్టి యతిశయోక్తు లసత్యము లనక యలంకారము లనిరి. పదార్థము మంచిదిగావున పొగడ్త కొంచెమెక్కువయ్యును ఓర్చుకొన్నది.

'ఏకత స్సర్వశాస్త్రాణి తులసీకావ్య మేకతః
వ క్తవ్యం కించి దత్యు క్తం వస్తుత స్తులసీ వరా'
(కలివిడంబన శతకము)

యను నీలకంఠదీక్షితునిమాట మనము మఱువరాదు. శిష్యుఁడైన కేతన దశకుమారచరితమును తెనిఁగించుటచే నతని యితరగుణములకు వశుఁడైన తిక్కన 'అభినవదండివిరా నాయనా' యని పిలచి యుండును. అతని కదే బిరుదమయ్యెను. కాని, నేఁడు సంస్కృతాంధ్రములఁ బ్రక్కలో నుంచుకొని చూచినవారి కెవ్వరికి దండి కేతనల కజ గజాంతరమని తోఁపదు? అంతమాత్రమున తిక్కనను స్మరించి మ్రొక్కని తెనుఁగువాఁ డెవఁడు?

ఇట్లు మాయిరువురకును మార్గములు వేఱు. పెద్దల వాక్యములు స్థాపింపఁ జూచువారు వారు. నా రుచికి పెద్దలవాక్యములు సరిపోవునా యని చూడఁ బ్రయత్నించువాఁడను నేను. ఐనను నా మతమునకుఁగూడఁ బెద్దలయంగీకారము గలదని నేనొక కారణముఁ జూపితిని. అదేదన: సోముని విడిచి యెఱ్ఱనను కవిత్రయములో నొక్కనిగాఁ బరిగణించియుండుట. సోమునికన్న నెఱ్ఱనయే ప్రాచీనుఁడను సిద్ధాంతము నే వీరేశలింగము పంతులుగారు మొదలగు వారు తొలుత నంగీకరించియుండిరి. తరువాత బుక్కరాజు శాసనము బైలుపడి వారిరువురును సమకాలికులని తేలినది. నేను వ్యాసము వ్రాయునపుడు పంతులుగారి కవిచరిత్ర పూర్వముద్రణముమాత్రము చూడఁగల్గితిని. (నేను మైసూరనుండుట యాంధ్రులు మఱువరాదు) ఎఱ్ఱన హరివంశము బాగుగనుండలేదను తాత్పర్యముతో సోముఁ డుత్తరహరివంశము వ్రాసెనని పంతులుగా రూహించిరి. నేను నట్లే తలఁచితిని. రెండు గ్రంథములను బోల్చి చూడఁగా, ఎఱ్ఱన పురాణ కవిత్వమునకు సోముఁడు ప్రబంధపు మెఱుఁగులు పెట్టినట్లు కానవచ్చినది. ఈ విషయమే నేను వివరించితిని. పరిమళపత్రికలో నది ప్రకటింపఁబడుటకుఁ గొంతముందుగా ఎఱ్ఱనకన్న సోముఁడే ప్రాచీనుఁడను వాద మొకటి శ్రీ వంగూరు సుబ్బారావుగారు బయలుదీసిరి. చరిత్రపరిశ్రమ మెక్కువలేనివాఁడ నగుటను, ఆవివాద వాఙ్మయము పూర్తిగా నాకు లభింపమిచేతను, ఆ విషయము చర్చింపక,

శ్రీ సుబ్బారావుగారి వాదమే సత్యమైనను సోమునికన్న నెఱ్ఱన యుత్తమకవియను సిద్ధాంతమున కేమియు బాధ లేదనియు, ప్రాచీనుని విడిచి యర్వాచీనుని కవిత్రయములో నొక్కనిగాఁ బరిగణించుటయే దానికి నిదర్శనమనియు భూమికలోఁ జేర్చి పంపితిని. అది యట్లే ముద్రిత మయ్యెను. ఎఱ్ఱన్నను కవిత్రయములోఁ జేర్చుటకుఁ గారణ 'మే నాలవ ఫారము' బాలుఁడైనను జెప్పఁగలడని వీరరాజుగా రను చున్నారు. అది భారత శేషమును బూర్తిఁ జేయుటయేయఁట! ఆ 'పంచమ వేదమును' తెనిఁగించినవారిలో నధర్వణాచార్యుఁడు లేఁడా? ఆధునికులలో తిమ్మయ లేఁడా? వీరినిగూడఁ జేర్చుకొని కవిచతుష్టయమో, కవిపంచకమో యని యేల చేయరైరి? తిక్కన భారతము వ్రాయుటచేతనే కవిబ్రహ్మ యయ్యెనుగాని, యదే శైలిలో నింక నే గ్రంథమును వ్రాసియుండినను అతని కా బిరుదము లభించుచుండ లేదందురా? నిజము చూడ, తక్కిన దేశములకన్న తెనుఁగువారికి భారతమం దెక్కువ గౌరవము గలుగుట తిక్క నాదులవలననేగాని, గౌరవమున రామాయణ మెందులోతక్కువ? మఱియు 'భాస్కర,రంగనాథ రామాయణాదులకంటె నెక్కువకవిత్వము గలిగియుండెనేని ఎఱ్ఱన రామాయణ మేల యంతరించుచుండె'నని వీరరాజుగారి ప్రశ్న! దీనికి నే నెట్లుత్తరమీవలయునో తెలియకున్నది. అంతరించుట యనఁగా నచ్చుపడకుండుట యని యర్థమా? సోముని హరివంశమున మొదటినుండి లేని కవిత్వము వీరేశలింగము పంతులు గారి కాలమున నెవరైన నించిరా? లేకున్న నంతపఱకదేల 'యంత రించి' యుండవలయును? మఱియు నెఱ్ఱన రామాయణము పూర్తిగా నశించినదనియే నికరముగఁ జెప్పఁగలవారెవరు? తెలుఁగు దేశ మంతయు నెవరు గాలించి చూచినారు? అలాభము నాశమే యగునా?

చ. పలుకఁదలంప దవ్వులగు భారత రామకథార్థముల్ విభా
సిలఁగ నరంటిపం డొలిచి చేతికి నిచ్చినరీతి నాంధ్ర వా
క్కులలితశక్తి నందఱకు సుప్రథితంబుగఁ జేసినట్టి ధ
న్యుల నుతియింతు నన్నయబుధోత్తముఁ దిక్కన నెఱ్ఱనార్యునిన్
(కళా. ఆ. ౧.)

పై సూరనార్యుని పొగడ్తలో సర్వాధికాధికార మెఱ్ఱనదే కదా? రంగనాథుని, భాస్కరుని సూరన యెఱుఁగఁడా? 'దేనిచే అత్యుత్తమ ఖ్యాతిం బొందితి'నని వేమారెడ్డి తలఁచెనో అట్టి రామాయణము నశింపవలసినదే యగునేని యది వ్రాయఁబడుచునే యుండ లేదు. అది నేఁడు గాకున్న రేపు లభింపఁగలదనియు, నప్పుడు వీరరాజుగారు తమ యభిప్రాయమును మార్చుకొనవలసియుండుననియు నా నమ్మిక.

మఱియొకమాట, ఇపుడు లభించిన వాదములన్నియుఁ జూడఁగా నెఱ్ఱన సోమనలు సమకాలికులనుభావమే బలియుచున్నది. కాని, సోముఁడు ప్రాచీనుఁడని రుజువు చేయఁగల సాధనము లింకను నాకుఁ దోఁపలేదు. పండితు లనేకు లట్లే తలఁచెదరు. ఇరువురిలో నెవరు పెద్దలో, యెవరు చిన్నలో చెప్పసాధ్యముగాదు. సోముఁ డెఱ్ఱన్న హరివంశమునుఁ జూచియే వ్రాసినాఁ డనుభావము నా కింకను గృశింపలేదు. అనఁగా నెఱ్ఱనకన్న నతఁడు పాండిత్యమునఁ దక్కువ యని నాయాశయము గాదు. ఎఱ్ఱన వృద్ధుఁడై, సోమన తరుణుఁడై సమకాలిక స్పర్ధచే నతఁడు వ్రాసిన గ్రంథమునే యింకను మెఱుఁగుగ వ్రాయవలయునని పూనినవాఁ డని తలఁచెదను.

'అభ్రంకషంబైన యాలపోతు నితండు త్రుంచినాఁ డీతండు పెంచినాఁడు' అని సోముని చమత్కారపూర్ణమగు పద్యమును జూచిన తరువాత, 'యజ్ఞరక్షకుఁడును యజ్ఞవిధ్వంసియునై లోక నుతులఁ బెంపారువాడు' అను కల్పనలేని పద్యము నెఱ్ఱన వ్రాసినాడన్న నాకు నమ్మికలేదు. సోముని గ్రంథమునందలి 'నిండారఁ దెగఁగొని నిగిడించు తూఁపుల' 'చేతులఁగసివోఁ గయ్యము' అను రెండు పద్యము లెఱ్ఱనగ్రంథమందు లభించుచున్నవి; గాన, సోముని హరివంశమును జూచియే యెఱ్ఱన వ్రాసెనని పంతులుగారనుచున్నారు. కాని యిందలి పద్యములే యందున్నవని యేల చెప్పరాదు? సోముని గ్రంథమునం దేర్చి తీసికోవలయునన్న నెఱ్ఱన కింతకంటె మంచిపద్యములు దొరక వయ్యెనా? లేక, యామాత్రపు పద్యములు వ్రాయవచ్చు వేళకు సరిగ ప్రబంధపరమేశ్వరుని ప్రతిభ కుంటువడెనా? ఎఱ్ఱనకు సహజముగ చాలని చిత్రకళాకౌశలము పై రెండుపద్యములు చేర్చుటచేఁ

బూర్తియయ్యెనని తలంచు వెఱ్ఱిచదువరి యెవఁడైన నుండునా?
'ఇందులఁగూర్చి విశేషచర్చ వేఱొకచోఁ జేసెద మనిరి' సరి:
అందాఁక వేచియుండుట నాకు విధి.

ఒకవేళఁ బై రెండుపద్యములును సోమునివేయని పంతులు గారు స్థాపింపఁగల్గినను, నే నిట్లు తలంతును: ఎఱ్ఱన గ్రంథము లన్నియుఁ జాల దురవస్థల పాలైనవి. భారత భాగమే కొంత మేలు. నృసింహపురాణ, హరివంశములు రెండును అనేక దుస్సంస్కారములఁ బొందినవి. రామాయణ మింకను బైలువడనేలేదు గదా! నృసింహపురాణపుఁ దాటాకులప్రతి యొకటి యొకప్రక్క శిథిలమై యుండఁగా, నాథునికు లొకరా భాగమంతయుఁ బూరించిరని వదంతి గలదు. ఎంత నిజమో యెఱుఁగను. సోముని కవనమునం దితరులు దూర్చిన కవిత్వాభాసమును పంతులుగారెఱుఁగకపోలేదు. అట్లే హరివంశమునందును ఎఱ్ఱనవి కావనిపించు భాగములు చాలఁ గలవు. యతి గణ ప్రాసాది భంగములు, అర్థ శబ్ద వైకల్యములును దిక్కు లేకయున్నవి. వానిని వివరింప నిదిగాదు చోటు. అట్టిచో గ్రంథపాతమును సవరించుటకై పై సోముని పద్యము లెవఁడో చేర్చియుండును. కాని, యెఱ్ఱనపై దయచే శిల్పభిత్తము నితరుని నుండి దొంగిలించి యీవలయునని, నాకుఁ జూడఁగా, కాదు.

ఎఱ్ఱన సోమనల పరస్పరభేదమునుగూర్చి నా యభిప్రాయ మిప్పుడు చెప్పుటకు మున్ను నే నెట్టి కవిత్వధర్మ మాధారముగాఁ గొందునో, యది సంగ్రహముగా నిందు వివరించుట యావశ్యకము. కావ్యమునకు జీవనము రసము. ఇప్పటి పండితుల కనేకులకు చమత్కారమునకును, రసమునకును భేదములేదు. కావ్యమున దేనిచే మనసున కెట్టి యానందము గల్గినను, అందుకు రసమే కారణమని భ్రమించి 'ఎంత రసవంతమైన కావ్య'మని మెచ్చుకొనుట వాడుక. 'రసము తేవలయునన్న వసుచరిత్ర కాఁడే తేవలయు' నని యుద్ఘోషించువా రున్నారు. శ్లేష తప్ప వేఱొకటి నేరనివారికి 'సరసకవిచక్రవర్తి' యని బిరుదిచ్చువా రున్నారు! పాండిత్యమును, ఉపజ్ఞయుఁ గలచోట రసమున్నదని భ్రమింతురు. కావుననే కల్పనాకవిత్వము వృద్ధికిఁ దెచ్చిన ప్రతి

కవియు నొక 'సరసప్రబంధము' వ్రాయఁబూనితి ననుచున్నాఁడు. మన వాఙ్మయమున నాలోకోత్తరపదమునకు వచ్చిన దురవస్థ మఱి దేనికిని రాలేదు. రస మనఁగా, మన లాక్షణికులు నియమించినట్లు శృంగారము మొదలగు తొమ్మిది భేదములే గలిగి 'యలౌకిక చర్వణావిషయ' మగు నొక వివరింపరాని పదార్థమని నా యుద్దేశము గాదు. తర్కశాస్త్ర పరాధీనులగు మన లాక్షణికులు వాద వివాదములను బెంచి యెవరో వ్రాసిన రసలక్షణమునే స్థాపింపఁబూని, రస శబ్దమునకు మార్గమును సంకోచపఱచిరని నా యభిప్రాయము. రస పండితుల సిద్ధాంతముప్రకారము,

'ఆలో ఎంతి పుళిందా పవ్వఅ సిహరట్ఠిఆ ధణుణిసణ్ణా,
హత్థి ఉళేహివ విఞ్ఝం పూరిజ్జంతం ణవబ్భేహిమ్'
(శా. స. ౨. శ. ౧౬)

ఆ. చెంచుమగలు ముదముచేఁ జూచుచున్నారు
విండ్లనూని శిఖరవీథి నిలిచి
మత్తగజములట్లు క్రొత్తమేఘుంబులు,
ప్రాఁకుచున్న వింధ్యపర్వతమును.
(నా భాషాంతరీకరణము. గాథాసప్తశతీసారము)

అను హాలికుని పద్యమున నేరసమును లేదు. కానీ, దీనిని జదువునపుడు ఆ యెండకు మాఁడిన పర్వతరాజు, ఉక్కుబొమ్మల వంటి చెంచుదొరలు, వారు చేతులూనుకొన్న విండ్లు, చలువనీడ నిచ్చుచు వానకాలము సూచించు క్రొక్కాఱు మొగిళ్ళు—ఇవ న్నియు మన కన్నులఁ గట్టితోఁచును. విండ్లపై నూని వింధ్యము నభిమాన ప్రమోదములతోఁ జూచు చెంచుమగల కెట్లో యట్లే, మనకును తన్మయత్వము గలిగి, నిర్వచింపరాని యానందము గలుగును. లేదన్న నాతప్పు లేదు. శృంగారము మొదలగు రసముల 'చర్వణ' యలౌకిక మేమి? యిది లౌకిక మేమి? ఏభావములైనను వాని తీక్ష్ణదశలో నవిదితవేద్యాంతరముగా ననుభవింపఁగల్గుదుమేని, యానందస్వరూపములై రసశబ్దవాచ్యము లగును : అనఁగా శిల్ప మం దన్నమాట. జుగుప్సాభక్తివాత్సల్యాదులుగూడ రసములేయని

వాదించువారు మనలో లేకపోలేదు. తర్కశాస్త్రము నోరు మూసినను, హృదయమును మూయఁజాలదు. కావున, కవి భావనాబలముచే తనకుఁగలుగు వివిధములగు శోకము, మోహము, అసూయ, ద్వేషము, సంతోషము, ప్రణయము మొదలగు భావములనఁబడు చిత్తవికారముల మూలమున వర్ణింపవలసిన పదార్థముల స్వరూపమును నిర్ణయించి, విగ్రహమును (ఏ విగ్రహమైననుసరే) సరళమగు భాషతోఁ దీర్చి యెదుర నిలిపినపుడు రసానుభవసంస్కారముగల సహృదయుల కట్టి మనోవికారములే కలిగి అవి యెట్టివైనను, శిల్పమందుఁగల యొకానొక యనిర్వచనీయ మహిమచే, ఆనందముగాఁ బరిణమించును. ఈ యర్థమందే ప్రకృతము రసపదమును నే నుపయోగించెదను. అది యిన్నివిధములని పలకపై సుద్దతో వ్రాసి చూప సాధ్యముగాదు.

కవిత్వసామాన్యమున కది ప్రాణము. కవి దానిని దీర్చిన నెల్ల నందుకుఁ దగిన మర్యాదఁ బొందును. తక్కిన గుణములు, అలంకారములు, రీతులు, పాకములు మొదలగు నర్థశబ్దధర్మము లన్నియు నా భావధర్మమున కుపస్కారకములు గాఁగలవు. కాని, దాని తరువాతివి. వీనిని చక్కఁగా నిర్వహించుటచేఁగూడ నొక యానంద ముదయించును; గాని, అది రసముతోఁ దులఁదూఁగదు. వీనినిగూర్చిన యొండు రెండు లోపములను గమనింపక పోవచ్చును; గాని, మూలమగు రసమున కేమాత్రపు విఘ్నము గల్గినను రసికులు సహింపలేరు.

ఇది మనసున నుంచుకొని యెఱ్ఱన సోమనల కవిత్వములను బరిశీలింపగా, రసపోషణదృష్టి యెఱ్ఱనకన్న సోమునికిఁ దక్కువ యని నాకుఁ దోఁచెడిని. సోముని సర్వజ్ఞబిరుదము, నవీనగుణసనాథత్వము మొదలగువానినిగూర్చి నాయాక్షేపము లేదు. అతని పాండిత్యమును గూర్చి నేఁజేసిన యాక్షేపము లల్పములనియు, నేఁజేయరానివనియు నంగీకరించితినిగదా! అతఁ డష్టాదశ పురాణముల, నుపపురాణములతోఁగూడఁ జదివియున్నను, లేకున్నను ప్రకృతమునకుఁ బనికి వచ్చున దతని కవితగాని పాండితి గాదు. ఎఱ్ఱనకన్నను బఁడితుఁడని మీా రంగీకరింతురేని నాయుద్ధులేదు. ఎందుకన, జౌననుటకును గాద

నుటకును బ్రమాణములు చాలవు. అతఁడు 'సర్వజ్ఞుఁ'డైన నితడు 'పరమేశ్వరుఁడు'. మఱియు నెఱ్ఱన హరివంశాదులలోఁ గొన్నిచోట్ల నతిబల్బజములైన భాగములును గలవు. శాంతిపర్వమునకును, విరాట పర్వమునకును శైలిబిగువులో సడలు లేక వ్రాసిన తిక్కన యోగ్యత నికి లేదని మనము నమ్మవచ్చును. వంశావళి, స్తోత్రములు, ధర్మములు, మొదలగు చప్పిడివిషయములు వ్రాసినచోట్ల నతఁడు వ్రాయవల యునేయని వ్రాసెనని మన మూహింపవచ్చును. కాని యేచోట వర్ణ్యమైన విషయమునకును అతనికిని మానసికసంబంధము గలదో యాచోట నతనివలె ధారాళముగ తీక్ష్ణముగ వ్రాయఁగలవా రరుదు. సోమునికి నట్టి రసపోషణశక్తి గలదనుటలో సందేహము లేదు. కాని యత డా శక్తికి స్వేచ్ఛాచార మిచ్చినవాఁడు కాడు. ఆకాలము నకే సంస్కృతవాఙ్మయమున మాఘుఁడు, బాణుఁడు, సుబంధువు, రాజశేఖరుఁడు మొదలగువారిచే స్థాపింపబడిన కల్పనాప్రధానమగు నాలంకారిక శబ్దార్థరచన ఇతనిని లోఁబఱచికొన్నది. కాని, రామ రాజభూషణాదులవలె దానికిఁ బూర్తిగా లొంగియుండమిచే నతని యుత్తరహరివంశము రసికుల నాకర్షింపఁ గలిగియున్నది. ఐనను రసప్రవాహమున నెఱ్ఱనయందున్నంత బిగువు, నిర్మలతయు నితని యెడ లేవు. ఒక్క యుదాహరణము మన్నింతురుగాక. ఉలూఖల బద్ధుఁడగు బాలకృష్ణుఁడు ఱోటిని జమిలిమద్దులనడుమ నీడ్చుకొని పోఁగా, నా చెట్లు కూలెను. అప్పుడు కొందఱు గోపికలు సంభ్రాంతలై పాఱివచ్చి యశోదతో నిట్లనిరి :

"ఉ. ఎక్కడిబిడ్డ నీకు? నిటు లెంతయుఁ గట్టిఁడి వేయుగంబులం
బొక్కెడుఱోటితో బలియుఁ బుత్రుని ద్రాళులఁ గట్టినాఁడు వా
రక్కట! గల్ల రట్లనఁగ నాఁడివోయెఁ గుమారుఁ డేపునన్
మిక్కుటమైన మ్రాఁకు లవెఁ మీఁదఁబడన్ వడిఁ దాఁ
బెనంగెడున్."

"మ. అనినం దల్లడమంది మేను విరియన్ హాయంచు గోపాలభా
మిని విస్రస్తములౌ పటాంచలము ధమ్మిల్లంబుఁ దూలంగ లో

చనపద్మంబుల బాష్పధార లెసఁగన్ సంభ్రాంతిఁ బాదద్వయం
బును దొట్రిల్లఁగఁ బాఱె గోపికలు నుద్భ్రాతాత్తలై
తోఁ జనన్."

ఉత్తరహరివంశమున ననిరుద్ధుఁడు చిత్రరేఖచే నపహరింపఁ బడఁగా నతని యేఁడువారు

చెందమ్మివిరులలోఁ జిందు తేనెలువోలెఁ
గన్నుల బాష్పాంబుకణము లడర,
వలుద చీకట్లలో వ్రాలు చుక్కలువోలె,
వేణీభరమ్ముల విరులు వ్రేలఁ,
దూలు తీఁగలవెంటఁ దూఁగు తేఁటులువోలె
ననదు నెన్నడుముల నారులొలయ,
రాపుఁ జక్కవలఁ జేరని చంద్రికలువోలెఁ
జన్నుఁ ముత్యాలసరులు పెనఁగ
ముద్దుమోములల్లార్చుచో మూఁపులందుఁ
గర్ణభూషణజాలంబు గళవళింప
మార్చిమార్చి చేతులవ్రేళ్ళు మడిచికొనుచు
'నింక నెట్లమ్మ' యనుచు నయ్యింతు లేడ్వ.
(ఉ. హ. ఆ ౫. ౨౭౮)

పై రెండుపద్యములను బరీక్షింపవేఁడెదను. ఏడ్పు సన్నివేశ మొక తీరయినను రసధార రెండవపద్యమునకన్న మొదటిదాని యందు తీక్ష్ణముకాదా? రెండవదానియందు చమత్కార మెక్కువ యని యంగీకరించితి. కాని యంతమాత్రమున మనము మోస పోరాదు. యశోద వెంటనే, కృష్ణుఁడు కాలో చేయిమో విఱుచు కొన్నట్లు, ఎట్లున్నగూడ 'సంభ్రాంతి' తోఁ బరువెత్తినట్లు, మనలఁ బరువెత్తించినట్లు, ఉన్నది మొదటిపద్యము. రెండవది, యేడ్చు వారితో సానుభూతిలేక తూలికయు వన్నెలుఁ దీసికొని నిదాన ముగా నవ్వుచుఁ జిత్రించినట్లున్నది. 'చెందమ్మి విరులలోఁ జిందు తేనెలు' 'వలుద చీకట్లలో వ్రాలుచుక్కలు' మొదలగు భావము

లుదారములే; చమత్కారజనకములే; కాని ప్రకృత రసముతో సంబంధము వానికి లేదు; ఇదిగాదు చోటు వానికి. మొదటిదాని యందు 'విశేషమేమియు లే'దని భావించెదరు వీరరాజుగారు. విశేషములలో విశేషమగు రసమం దున్నది. సోముని పద్యము వ్రాయుటకు అతనివంటి ప్రతిభాశాలియే కావలయును—గాని ఎఱ్ఱన పద్యములవంటి పద్యముల నెవ్వరైన వ్రాయఁగలరని పంతులుగా రందురు. కాళిదాసుని స్వయంవరమున కన్న శ్రీహర్షుని స్వయం వరమున 'విశేష' మెక్కువయున్నదని, యందుచే నతనికన్న నితఁడు గొప్పవాఁడని వాదింతురేని వారికొక్క నమస్కారముతప్ప నావంటి వాఁ డేమియుఁ బ్రత్యుత్తర మీఁజాలఁడు.

లోకమంతయు ఔనన్నది నేను కాదన్నానని తలఁచి, నాయెడ నసూయను, సోముని సర్వజ్ఞబిరుదమునెడఁ బక్షపాత మును వహింపక, యెఱ్ఱన సోమనల కవిత్వమును మఱియొకతూరి పంతులుగారు పరిశీలింతురేని, నా వ్యాసము నంతయెక్కువగా నింకమీఁద ఖండింపరని నా నమ్మిక. కాని, వారి సిద్ధాంతము వేఱని మొదలే విన్నవించితిని. సోముని పాండిత్యము, పదవాక్య ప్రమాణజ్ఞత, మొదలగునవి వారి యభినందనములకు మూలములు. నాచన సోముని తక్కిన బిరుదములెట్లయినను 'సాహిత్య రసపోషణ' బిరుదమం దతిశయోక్తి కొంత యున్నదని నా మతము. ఇది గమనింపక వారు నా మతమును ఖండించిరి.

మ. ధనదాంతఃపుర తారహారములు ; యాదఃపాలబాలాఘన
స్తనకాశ్మీరము, ధర్మరాట్కులవధూ సంవ్యానకౌశేయమున్
దనుజేంద్రారి వరావరోధ దయితా ధమ్మిల్ల మాల్యంబులున్
గినుకం దెచ్చి ఘటింపఁజూచు జయలక్ష్మి నిత్యనై పథ్యమున్.

ఇత్యాది సోమనపద్యములలో దిక్పాలకజయమునుగూర్చి యోజించునపుడు, నరకాసురుఁడు తనకును తెలియక యప్రదక్షిణ క్రమముగనే వారి పేళ్ళను దడవినట్లు సోముఁడు వ్రాసెననియు, అందువలన నరకునికి రాఁగల యపజయము సూచింపఁబడినదనియు యెఱ్ఱన యట్లు చేయఁజాలఁడయ్యెననియు వా రనుచున్నారు. ఈ శకునశాస్త్రజ్ఞానము నరకునికే లేనపు డెఱ్ఱన కేలయుండవలయునో?

ఉండినను కవిత కది యె ట్లుపకరించునో? యెఱుఁగ లేకున్నాను!
మఱియు,

" బలిమికోలున నవ్వు దళుకొత్తినను మొగం
బెల్లఁ దానై యున్న వెల్లదనము "

అను సీసపద్యము భావపూర్ణమని పొగడి నేను తిక్కన యొక్క "ముదమున నెలమి" యను పద్యముతోఁ బోల్పఁగా పాదాంతములలో తిక్కన పద్యములో నున్నట్టి చదరపు నడక యెఱ్ఱన పద్యమున లేదని రెంటికిని బోలిక యనుచిత మనిరి! ఇట్లే

"సీ. దైతేయ మదవతీ ధమ్మిల్లములతోడ
విరుల నెత్తావికి వీడుకోలు,
దనుజశుద్ధాంత కాంతాకటాక్షములతోఁ
గలికి కాటుకలకుఁ గానివావి,
దానవమానినీ స్తన కుంభములతోడఁ
బసపుపయ్యెదలకుఁ బాయు పొందు,
దైత్యావరోధనదయితాధరములతో
సొబగు వీడెములకుఁ జుక్కయెదురు
చేసి, సురసుందరీకరాశీరతాళ
వృంతచలితాంతకుంతలవిలసదింద్ర
కులవధూటీలలాటికాకుంకుమంబు
పదిలపఱుపఁ జక్రంబ! నీభరముకాదె!"

అని సోముని పద్యమున నాలుగుపాదములయందుఁగల 'దైతేయ మదవతీ' 'దనుజ శుద్ధాంత కాంతా' 'దానవ మానినీ' 'దైత్యావరోధనదయితా' పదములందలి పనికిరాని పునరుక్తిని వారు మఱుఁగుపెట్టి, రాక్షసకాంతలకు విరులు, కాటుక, పసుపు, వీడెము మొదలగు సౌమంగల్య చిహ్నములను శ్రీవిష్ణు సుదర్శనము నశింపఁజేయునని చెప్పుటచే వారికి వైధవ్యము సూచించెనని అతిశయోక్తిలో నత్యుక్తి సంకరించిరి! ఇంతేకాక పై 'ధనదాంతః పుర'యను పద్యమున దేవతాస్త్రీలకు వైధవ్యముఁ గలిగించుటఁ గూర్చి నరకుఁ డాలోచించువేళ "పెరిగినను, కరఁగినను, మాసినను,

నలఁగినను, మఱల మఱల ధరించుకొనునవియు, సౌమంగల్యమునకు భంగము లేనివియునగు తారహారములు, కాశ్మీరము, సంవ్యానకౌశేయము, ధమ్మిల్లమాల్యము అను తాత్కాలి కాలంకారముల మీఁదికే నరకునిదృష్టి పోవునట్లు చేసినాఁడు'' అని స్తుతించిరి. రాక్షసస్త్రీల ధమ్మిల్లములనుండి తీసివైచిన వైధవ్యము గలిగించు 'విరులు'ను దేవతాస్త్రీల ధమ్మిల్లమ్ములనుండి తీసినను 'సౌమంగల్యమునకు భంగము లేని' 'మాల్యములు' ను వేఱుపదార్థములా? తారహారములు, స్తనకాశ్మీరము, ధమ్మిల్లమాల్యములు—ఇవి సౌమంగల్యచిహ్నములు కావేని, విరులనెత్తావి, కాటుక, పసుపు, వీడియము మొదలగునవిమాత్ర మెట్లగును? ఒకవేళ దేవతలకును రాక్షసులకును స్త్రీధర్మశాస్త్రములు వేఱు వేఱనుకొన్నను పై భావములు సోముని కవిత సమయాచారబద్ధమేకాని రసస్వాతంత్ర్యమును వహించినదిగాదని బోధింపవా? రసదృష్టితోఁజూచువారికి రాక్షసవిధవలని, దేవతావిధవలని భేదముగలదా? మగని బోఁగొట్టుకొని యేడ్చు నేయాఁడుదియైనను భావుకుని మనసు గరగింపదా? రాక్షసుల తప్పులకు వారిని సంహరించుట యుక్తమే. కాని వారి భార్యల యేడ్పులకుఁ గవి సంతసింపవచ్చునా? రావణుని జంపిన తరువాత 'మరణాంతాని వైరాణి నివృత్తం నః ప్రయోజన' మ్మని పల్కిన యుదారహృదయుఁడగు శ్రీరామచంద్రున కింతమాత్రము తెలియదాయెనా?

ఇఁక సోమునికవనమున నిరర్థకములగు దీర్ఘసమాసము లనేకములు గలవని నే వచింపఁగా, నెఱ్ఱనాద్యులయందును గలవని వారు చూపిరి. తిక్కన వ్రాసిన యొక్కసమాసపదమును వెదకి యెత్తిరి. తిక్కన భారతమున నట్టి సమాసము లనేకములు వ్రాసియుండెనేని, అతని యుద్దేశము ప్రకారము 'ఆంధ్రావళి మోదముంబొరయు' చుండెనా? అట్లైనను సోముని సమాసములకు నెఱ్ఱనాదుల సమాసములకు సమాసత్వము సమానమైనను అర్థాన్వయాదులలోఁ జాలభేదము గలదని పంతులుగారు గమనింపఁదలఁచుకోలేదు.

'ముందటి దిక్కూడి మొలత్రాటఁదవిలిన
తోఁకగోచులవెంటఁ దూలువారు'

అను పద్యము సోముఁడు మొగము మాడి వేసికొనియే వ్రాసె నని వారి యభిప్రాయము. పరిహాసదృష్టి యున్నదని నామతము. మహర్షుల యవస్థకు నేను నవ్వితినని వారు భ్రాంతిపడిరి. నవ్వినది సోముఁడో? నేనో? చదువరులు మఱల నూహింతురుగాక. ఇట్లే 'పోరానిచుట్ట మితఁ'డను పద్యమున నెట్టన యింద్రుని గేలిచేసె నని నేఁదలఁచితి. నాది విపరీతవ్యాఖ్యయని పంతులుగా రనెదరు. కాని, ఉర్వశికి, నిత్యసుమంగలికి వైధవ్యమును గలిగించిన వారి వ్యాఖ్యకన్న నిది విపరీతమా?

ఈ సందర్భమున నింకొక విషయము: నరకాసురుఁ డూర్వశిని బిలిపించిన కథ మూలమున లేదంటిని. 'ఏ రేమూల చూచిరో?' యని నన్నధిక్షేపించి పంతులుగా రొక శ్లోకము నుదాహరించిరి. గోపాలనారాయణ కంపెనీవారి నాగరముద్రణమును, పురాణం హయగ్రీవశాస్త్రిలుగారి తెనుఁగు ప్రతియు నేఁజూచితిని. కాని, పై రెండు ప్రతులలో 'నే మూల' లోను వారు చూచిన 'మూల' లేదు. విష్ణు పురాణమందును ఈ కథ గానరాదు.

ఉషాపరిణయ ఘట్టము, ఊర్వశీ చరిత్ర మొదలగువానిపై వారి విమర్శనమునకు నేను ప్రతి యీఁదలఁచుకోలేదు. రుచిభేద మిందుకుఁ గారణము. మఱియు వారి పూర్ణవిమర్శమింకను బైలు పడలేదుగదా! నా వ్యాసనామము, ఎట్టన పద్యములలోని పదములు, నావ్యాసమందలి పదఖండములు మొదలగువానినిగూర్చిన తక్కిన విమర్శము వారు చేయఁదగినదియుఁ గాదు. నేను ప్రత్యుత్తర మీయఁదగినదియునుఁ గాదు.

కృష్ణ కైలాసయాత్రాఘట్టమున స్పష్టముగఁ గానవచ్చు పూర్వోత్తరవిరోధమను విరోధము గాకుండఁ జేయుటకై పదు నెనిమిది పుటల విమర్శనము పంతులుగారు వ్రాసిరఁట! సోముని యెడ వారికిఁగల పక్షపాతమును, నా యెడ వారికిఁగల యసూయయుఁ బై యొక విషయముచేఁ జదువరులు గ్రహింపఁగలరు.

సోమునియందలి పై యభిమానముచే నెట్టనను వీరు చాల తక్కువపఱచిరి, దీనికి విపరీతమగుపనియే నా వ్యాసమున నేను

జేసితినని యంగీకరించితిఁగదా! అందుకు నేను పరితపించునట్లు పంతులుగారును పరితపింపఁగలరా? నాకుఁ దోఁపదు. ఏలయన: నెట్టిన కవితయందు లేని గౌరవ మెట్టినయందుఁ గలుగుట కష్టము. సోముఁడు సింహమనియు, నెట్టిన చిఱుతపులి (పెద్దపులియుఁగాదు) యనియు వా రింకను దలఁచుచున్నారు ఐన నదే చిఱుతపులికే సింగము తరువాతఁ జక్రవర్తిపదవి నియ్యవలసెను! వీరందఱు ముందఱ నక్కవంటివాఁడనియా సన్నయకు వా రేపదవియు నీయరైరి? కాని, అతఁడు మహితాత్ముఁడని, దక్షుఁడని వారే వాకొనిరే! ఎఱ్ఱనకన్న హీనుఁ డయ్యెనా? అతనికే యాంధ్రవాఙ్మయసామ్రాజ్యమున నధికారము లేదేని, తిక్కన యెఱ్ఱన లేమని సిగ్గులేక యా యధికారమును గైకొందురు? ఎఱ్ఱనకుఁ దరువాత శ్రీనాథుఁడు ప్రయత్నించె నఁట గాని, యా సింహాసనముమాత్ర మతనికి లభింపలేదఁట! ఏల? అతఁడు కవిసార్వభౌముఁడే!

ఈ యీర్ష్యావాదముల కేమి? పోనిండు. ముగింపున నొక మాట. రసికుల కెట్టినయందలి యభిమాన మెన్నఁడును గృశింపదు. చిత్రకర్మచే నెవరి మనసులు రంజిల్లునో వారి కెట్టనకన్న సోముఁడు మేలుగాఁ దోఁచును. పంతులుగారు చిత్రకవితాభిమానులని నమ్ముచున్నాను. అట్లయిన నాయందలి యొండు రెండు లోపములను సవరించినందుకు మఱియొకతూరి వందనము లర్పింతును. అంతియకాని మేమిరువురము నేకాభిప్రాయులమై చేరి వాఙ్మయసేవను చేయఁగల కాలము రాఁజాలదేమో! కానిండు. భవభూతి మనపాల నున్నాఁడు.

> "యే నామ కేచి దిహ నః ప్రథయం త్యవజ్ఞాం
> జానంతి తే కిమపి తాన్ప్రతి నైష యత్నః
> ఉత్పత్స్యతేఽస్తి మమ కోఽపి సమానధర్మా
> కాలో హ్యయం నిరవధి ర్విపులా చ పృథ్వీ."

## త్యాగయ్యగారి నాదసుధారసం*

౭

శ్రీ త్యాగయ్యగారు ప్రపంచానికి ప్రసాదించిన వరం గంగానదివలె మూడు మార్గాలతో ప్రవహించింది. శ్రీరామభక్తి, కవిత, గానం. ఈ మూడు తత్త్వాలున్ను పూర్వజన్మార్జితమైన పుణ్యంచేతనేతప్ప మనుష్య ప్రయత్నంతోగాని, ఆకస్మికంగా గాని లభించేవి కానంత గొప్పతనంతో ఇంచుమించుగా ఉన్నవి. అయినా వంశపరంపరగా ఇంటిసొత్తుగాకూడా ఆయనపాలికి దొరకినవని చెప్పడానికి కావలసినంత సాక్ష్యం ఉన్నది.

త్యాగయ్యగారి ప్రియశిష్యుఁడైన సౌరాష్ట్ర వేంకటరమణ భాగవతులు తన గురువుగారి జీవితచరిత్రను కొంతవరకూ సంగ్రహంగా వ్రాసిపెట్టినాడు.[1] దానిలో త్యాగయ్యతండ్రి రామబ్రహ్మంగారినిగూర్చి ఈ మాట లున్నవి :

'వీరు శ్రీమద్రామాయణ, భాగవత, భారతాది ప్రసంగాదులయందు ప్రవీణులును, తంజావూరు తులసింగమహాప్రభువుల వారి సంస్థానంలో శ్రీమద్రామాయణప్రసంగంచేసి శ్రీరామనవమి గర్భోత్సవము సలిపి అనేక సన్మానముల నొందిరి. ఆ ద్రవ్యాలచేత తన యింట్లో శ్రీరామనవమి జననోత్సవమును అతి విమర్శగా చేయుచు నుండును.'

త్యాగయ్యగారి తాతగారైన గిరిరాజ బ్రహ్మంగారిని గురించి 'వీరు సకలవిద్యలయందును సమర్థులు' అనిమాత్రం

* 1946 డిసెంబరు మాసాంతాన మద్రాసు మ్యూజిక్ ఎకాడమీవారు జరిపిన శ్రీత్యాగరాజ శతవార్షికోత్సవ సందర్భంలో చదివిన ప్రసంగం. వ్యయ సంవత్సర పుష్య 'భారతి' లో ప్రకటితము.

1. దీనిని వ్యయసంవత్సరాది సంచికలో 'ఆంధ్రపత్రిక' వారు ప్రకటించిరి. మూలం మధుర సౌరాష్ట్రసభ వారివద్ద గల తాటాకుల ప్రతి.

పై చరిత్రలో గలదు. కాని ఎట్టయాపురం సుబ్బరామ దీక్షితులు గిరిరాజకవినిగూర్చి 'ఇతడు...సంస్కృతాంధ్రభాషలలో మిక్కిలి ప్రజ్ఞగలవాడు. సంగీత విద్యాసంపన్నుడు. ఇతడు తెలుగున భక్తి రసముగాను, వేదాంతవిషయముగాను బహుకీర్తనములజేసి ప్రఖ్యాతిని బొందినవాడు' అని వ్రాసినారు.[1] ఐతే,

'మాయా నీ వంచన నడువదు! మాటాడక పోవే'.

అనే కాంభోజిరాగం వేదాంతకీర్తన ఒకటే సుబ్బరామదీక్షితుల పుణ్యాన చిట్టతోపాటు మనకు లభించింది.[2]

తక్కినవి నాకు దొరకలేదు. ఐతే తంజావూరు సరస్వతీ మహాలు భండారంలో శాహాజీమహారాజును, శరభోజిమహారాజును నాయకులనుగాజేసి, గిరిరాజకవి రచించిన శృంగారపదాలు కొన్ని నూర్లకైనా తక్కువకాక, దిక్కూ దశా విచారించేవాడు లేక మూల్గుతూ ఉన్నవి. ఆయన రచించిన తెలుగు యక్షగానాలు కూడా కొన్ని అక్కడ కలవు. గిరిరాజకవి తండ్రి పంచనద బ్రహ్మంగారుకూడా 'వేద శాస్త్ర పురాణాదులయందు నిపుణుడు' అని పై త్యాగరాజచరిత్రలో ఉన్నది. కనుక త్యాగయ్యగారి పూర్వీకులలో కనీసం మూడు తరాలవారు సంగీత, సాహిత్య భగవద్భక్తులకు పేరుపొందినవారనిన్నీ, అందుచేత ఆయన కా మూడు విషయాలున్నూ, వద్దన్నా వదలక, ఉగ్గుపాలతో వచ్చిన వనిన్నీ చెప్పడానికి సందేహంలేదు. మరి అనిర్వచనీయమైన ఆయన ప్రతిభాశక్తిచేత ఆమూడూ చాలాప్రబలించినవి. మూడూ ఒకదానికొకటి వర్చస్సు నిస్తూ పెరిగినవి. ఒకదానితో మరి రెండూ ఎప్పుడుగాని విడిపోక ఏకకుటుంబంగా నడచినవి. సంగీతానికి ఉల్లాసం ఎక్కువైనసమయంలో భక్తి సాహిత్యాలూ, భక్తి ఉద్రేకించిన వేళలో సంగీత సాహిత్యాలూ, కావ్యకళ మెరసినప్పుడు భక్తి సంగీతాలూ వెనుక నిలచి మేళం నడిపించినవి. ఈ త్రివేణీ

1. సంగీత సంప్రదాయ ప్రదర్శిని—పూర్వభాగం. వాగ్గేయకారుల చరిత్ర, పుట ౧౨.

2. అదే. ఉత్తరభాగం. అనుబంధం (B) పుట ౬౦.

సంగమాన్ని ఇంత స్పష్టంగా మనం త్యాగయ్య జీవితమందే చూడ వచ్చును. ఈ మాటినీ ఆయన ఆత్మోద్ధారణకై సాధించి ఉపాసించి నాడు. కీర్తి, ద్రవ్యం, ప్రతిష్ఠ మొదలైన యే ఇతర ఫలాలనూ ఆసించిక, ఇతర జీవులూ తరించవలెననే ప్రపంచానికి మాటినీ వెదజల్లినాడు.

ఐతే, ఆయన ధారాళంగా ఇచ్చిన ఈ తత్త్వత్రయాన్ని మన మెంతవరకు గ్రహింపగలము? ఎంత జీర్ణించుకోగలము? మన కీ మాటిలో ఏది ముఖ్యం? ఏది గౌణం? ఈ విషయంలో నా దృష్టిని మాత్రం ఇక్కడ మనవిచేస్తాను.

త్యాగయ్యగారి భగవద్భక్తి నావంటివాని యోగ్యతకు చాల దూరం మించిన మహాతత్త్వం. ఆయన భక్తి సంస్కారం గొప్పది. కనీసం నాల్గుతరాలది. ఇంక ఆయనసాధన అతిమానుషమైనది. పుట్టినది నిర్గుణైకబ్రహ్మవాదులైన స్మార్తబ్రాహ్మణుల కులంలో. పెరిగింది శివుడు, విష్ణువు, స్కందుడు, పార్వతి, లక్ష్మి, సరస్వతి, తులసి, విఘ్నేశ్వరుడు మొదలైన అన్ని దేవతలకు సమానంగా మొక్కులు చెల్లించవలసిన సంప్రదాయంలో. ఈ పద్ధతిలో ఏ దేవతావ్యక్తియందుగాని ఆత్మీయత అనేభావాన్ని దృఢంగా అనుభ వించే అవకాశం చాలదు. కాబట్టి భజన సంప్రదాయ ముండినా భక్తిసాధన ఈ సన్నివేశంలో మహాకష్టం. భక్తిజ్ఞానాలు రెంటికీ ఏకాగ్రత ముఖ్యసాధనమే. కాని, అన్వయంలో రెంటికీ ఎంతో భేదమున్నది. మనోమార్గాలను సంకోచపరచి నిర్గుణతత్వాన్ని సాధించే 'సోహం' సిద్ధాంతం జ్ఞానమార్గం. వాటిని వికాసపరచి అనంతకల్యాణగుణపరిపూర్ణతత్వం ప్రత్యక్షీకరించుకొనేది భక్తి పంథ. ఐనా ఈ భక్తిమార్గానికి భిన్నరూపగుణ చరిత్రాదులు గల బహుదేవతల పూజాపురస్కారాలు సాధకములు కాజాలవు. ఏదో ఒకవ్యక్తిని పరదేవతగాభావించి, సమీపించి, అనుభవించి, ఉపాసించ వలసిఉంటుంది. తక్కిన దేవతలు, మునులు మొదలైనవారెంత గొప్పవారైనా ఆ మూలదేవత కనుచరులుగానే గమనింపవలసి ఉంటుంది. ఇట్టి పరమైకాంతభక్తికి పునాది చాలా చిన్నతనమందే త్యాగయ్యకు వేసినారు. 'గోలిగుండ్లాడే' ప్రాయమందే తండ్రి

రామబ్రహ్మం కొడుకుకు రామనామోపదేశం చేసినాడు. తరువాత 'ఐదారుదినములకే' రామకృష్ణానంద స్వాములనే యతీశ్వరుడు శ్రీరామషడక్షరీమంత్రాన్ని అంగన్యాస కరన్యాసాలతో ఉపదేశించి నాడు. ఆ మంత్రాన్ని అది మొదలు దిన మొకటింటికి లక్షయిరువది యైదువేల నామముల ప్రకారంగా జపిస్తూ త్యాగయ్య తమ ముప్పది యెనిమిదవ ప్రాయమున తొంభైయారుకోట్ల నామములను పూర్తి చేసిరి* అని ఒక కథ. మూడుమార్లయినా కోటిజపం ముగించి నాడని వేంకటరమణ భాగవతుల వ్రాతవల్ల తెలుస్తుంది. ఎట్లయినా త్యాగయ్య తన ఆయుష్కాలంలో చాలాభాగం శ్రీరామమంత్ర జపానికి వినియోగించినాడనేమాట సత్యం. దానికితోడు త్రికాల పూజ; మిగిలిన కాలం కీర్తనల రచనకు. భక్తిరసం ప్రవహించే తొమ్మిది మార్గాలలో త్యాగయ్య దేనినీ విడువక అన్నిటినీ సాధించి నాడు. కనుకనే ఆయన జీవితమంతా ప్రధానంగా రామమయమైనది. ఇతర దేవతలపైన శ్రద్ధ సళ్ళింది. తుదకు సీతాదేవిమీదగూడా ఎక్కువగా చిత్తసమాధి కలిగించుకొనే అవకాశం ఆయనకు లేక పోయింది. అభిమానంలో తారతమ్యాన్ని విచారిస్తే శ్రీరాముని తరువాత తక్కిన అన్ని దేవతలకంటె పార్వతీదేవిమీద ఆయనకు ప్రతిపత్తి ఎక్కువగా ఉన్నట్టు కానవస్తుంది. ఈ రామభక్తి వికాసమార్గంలో పెరిగి పెరిగి తుదకు శ్రీరాముడుకూడా త్యాగయ్యపాలికి తన మేరలన్నీ దాటి సర్వాత్మకుడైన పరమాత్మగా ప్రత్యక్షమైనాడు. 'పరమాత్ముడు వెలిగే ముచ్చట' మొదలైన కీర్తనలలో ఈ పరిణామం స్పష్టంగా కానవస్తుంది.

తక్కిన పెద్దలంతా భక్తికిఫలంగా భుక్తిముక్తులు రెండూ కావలెనని కోరుతూఉండే కాలంలో త్యాగయ్య ముక్తి ఒక్క దానికే వేకారినాడు.

> 'రామా నీపై తనకు ప్రేమపోదు
> భోగానుభవంబులందు బాగుగా బుద్ధినీయదు'

---

* కె. వి. శ్రీనివాసయ్యంగారి త్యాగరాజకీర్తనలు, పీఠిక, పుట ౧౨

అని తన మనోగతిని ఆయన ఘోషించినాడు. దేశమంతా చిన్న చిన్న రాజులు, జమీందార్లు, పాళేగార్లు, దోపిడికాండ్లు మొదలైనవారి చేతులలో నలిగి ఛిన్నాభిన్నంగా చెడి చెటాకుల గలుస్తూఉన్న కాలంలో, కుంపిణీ తెల్లదొరలు వారినీ వీరినీ తగలబెట్టి తమాషా చూస్తూఉన్న సమయంలో, రాజులనీ అధికారులనీ పేరు పెట్టుకొన్నవారి అడుగులకు మడుగులొత్తకపోతే, వారిమీద పదాలో పద్యాలో కట్టి పొగడి పైకెత్తకపోతే, బ్రతుకేలేని సన్నివేశాలలో,

'దుర్మార్గచరాధముల దొర నీవనజాలరా'

'జేన దుదరమునింప నే నరుల పొగడితినా'

అని రామునితోనే మొరబెట్టుకునే విరక్తి, హఠం, శ్రద్ధ, నిర్లక్ష్యం అలవరచుకొని ఎనభైయేండ్లు దినగండం దీర్ఘాయుస్సుగా జీవిత సూత్రాన్ని బిగబట్టి నడిపినాడు! ఇటువంటి సంస్కారబలం, సంప్రదాయశుద్ధి, సంకల్పదార్ఢ్యం, సాధనతీవ్రత లేకపోతే భక్తి వట్టి బహిర్లేపమో, వేషమో అవుతుంది. ఈ కాలంలో ఎంతమందికీ గుణాలు ఎంతమట్టుకున్నవో నాకు తెలియదు. నామట్టుకు నాకు లేవనేది సత్యం.

ఇంతేకాదు. శివభక్తులు, దేవీభక్తులు, స్కందభక్తులు మొదలైన వారిమాట అట్లుండనియ్యండి. వైష్ణవులలోనే కొందరికి రామునికంటే కృష్ణునిమీదా, నృసింహునిమీదా భక్తిభావం ఎక్కువగా ప్రసరిస్తుంది. ఇది వ్యక్తులందు ఎన్నో కారణాలచేత కలిగే చిత్తదౌర్బల్యం. త్యాగయ్యకూడా దీనికి తప్పలేదు. పై కృష్ణాది మూర్తులమీదా శాస్త్రానికి రెండు మూడు కీర్తనలు మాత్రం ఆయన రచించినా డంతే. కాని, ఆయన లక్ష్యమంతా, నమ్మకమంతా

'కోదండపాణిరూపముతో వెలసినవాడేరా దైవము'

అనే వ్యాపించింది.. కనుక ఆయన భక్తిమార్గం వైష్ణవ హిందువులలోనే ఎక్కువ వ్యాపింపజాలదు. మరిన్ని ఏ భక్తిగాని కొన్ని సంకేతాలకూ, సంప్రదాయాలకూ లోగిఉండక తప్పదు.

విష్ణుభక్తికి రామానుజ, మధ్వాది సంప్రదాయాలు, సంకేతాలు ఎన్నో ఉన్నవి. త్యాగయ్యగారిది స్మార్తసంప్రదాయం; అందు లోనూ స్వంతమార్గా లెక్కువ. వారికందరికీ ఇది అంటడం సులభంకాదు. ఇక హిందువులు కానివారిమాట చెప్పనక్కర లేదుగదా. కనుక వ్యక్తి, సంఘం, జాతి, మతం మొదలైన కట్లు కంచెలు అన్నీ విచ్చుకొని తోసుకొని పోగల్గిన ఏ ఒకరిద్దరు మహానుభావులకోతప్ప సామాన్యులకు త్యాగయ్యగారి భక్తిమార్గం అందరాని పండు. అందినా తినలేము. తిన్నా జీర్ణించుకోలేము.

త్యాగయ్యగారి రెండవవరం కవిత్వకళ. మహాకవుల కుండవలసిన గుణాలెన్నో ఆయనయందు స్వతస్సిద్ధంగా ఉన్నవి. చిన్నతనంనుంచీ పద్యాలూ, పాటలూ అంతులేక విన్నాడు. వల్లించినాడు. స్వాభావికంగా రచనోత్సాహం కలవాడుగాబట్టి ఛందస్సు, యతిప్రాసలు మొదలైనవానిని సులభంగా వశీకరించుకోగల్గినాడు. భావాలలో ఆర్జవం నిండి ఏమాట చెప్పినా వర్చస్సుతో చెప్పగలిగినాడు. కృత్రిమంగా మీదవేసుకొన్న భావాలు ఆయన రచనల్లో లేనేలేవనవచ్చును. కొన్ని సాంప్రదాయికపుమాటలుతప్ప అన్నీ నిండుగా బ్రతికిన భావాలే. దీనికి తోడు తన యిష్టమెట్లు వస్తే అట్లు వర్తించి వ్యవహరించే ధైర్యమూ, స్వాతంత్ర్యమూ ప్రబలంగా ఉండినది. దీనితో రచనకు ఒక నవ్యత ఏర్పడి, భావాల కొక విలాసమూ, భాషకు ధారాళతా వచ్చి వినేవారి నాకర్షించగలదు. రామభక్తీ, తనకు ముక్తీ ఇవి రెండే భావనావిషయాలై కవితాకళకు వలయం సంకుచితమైనా, దానిలోనే కొత్తకొత్త త్రోవలు త్రొక్కి ఆడే ప్రతిభాబలమున్నది. కనుకనే ఈతని చేతికి దొరకిన శ్రీరామమూర్తి, దీక్షితులు మొదలగువారి దేవతలవలె, కేవల ధ్యానోపయోగిమూర్తిమాత్రం కాక, మనతో చేరి, మనవాడై కానవచ్చుచున్నాడు. దివ్యమూర్తి మనుష్యుల అంతస్తుకు దిగినాడు. 'ఆత్మానం మానుషం మన్యే' అని ఆయన చెప్పిన అసత్యవాక్యం సత్యంగా, త్యాగయ్యగారి కవిత పుణ్యాన, మనపాలికి పరిణమించినది. తెలుగు కవులలో పలువురికీ శక్తి లేదు.

ఐతే, త్యాగయ్యగారి జీవితంలో ఆ శక్తికి భాషలోగాని, భావాలలోగాని తగినంత యేర్పులూ, తీర్పులూచేసే అవకాశమూ, సంస్కారమూ చాలక, ఆయన కవిత పల్లెటూరిపడుచువలె అకృత్రిమంగా నిలిచింది. ఆయన తెలుగుభాష నాలుగైదు తరాలుగా తమిళదేశంలో నిలబడి సహజమైన పెరుగులూ మెరుగులూ చాలావరకు కోలుపోయింది; జడ్డుగట్టింది. 'మూడు రెండు నది నాథుడు' 'నిద్దురజితుడు'[1] వంటి కృత్రిమరూపాలతో, అందముకులైన వాక్యాలతో నడచింది. ఆయన సంస్కృతంకూడా ఎక్కువ వ్యాసంగాని కవకాశం చాలలేదనిపిస్తూ, నేర్చినదానికంటే విని గ్రహించిందే ఎక్కువ అని పదేపదే సూచిస్తుంది. 'కేచన నిజభక్త నిచయ' 'ముఖజితభార్యే'[2] ఇత్యాదు లుదాహరింపవచ్చును. త్యాగయ్య వ్యాకరణ నియమాలు ఉల్లంఘించినాడనే కాదు నా మనవి. ఆ ఉల్లంఘున సహజమైన సరళమార్గంలో నవడలేదనే. తాళ్ళపాకవారు, క్షేత్రయ్య మొదలైన పదకవులందరూ, ఎందరో పద్యగద్యకవులూ, వైయాకరణుల అధికారానికి మితినికలిగించిన వారే, శబ్దశాస్త్ర నియమాలను ఎదిరించే దొమ్మగలవారు, అప్పుడప్పుడుండబట్టే ఏభాషగాని ప్రవాహినిగా నడుస్తుంది. లేకపోతే పడియ నీళ్ళవలె మలిచిపోక తప్పదు. కాని ఆ ఉద్యమం ఆ యా భాషల ఆవరణంలోనే జరగవలసి ఉంటుంది. త్యాగయ్యగారి ప్రయత్నమో ఆ వలయానికి బైట అవిమర్శగా జరిగింది.

ఇంక ఆయన భావాలుగూడా ఎన్నోచోట్ల పై అపక్వతనే సూచిస్తున్నవి. శక్తికితోడు లోక శాస్త్ర కావ్యాదుల పరిశీలన వల్ల కలిగే జాణతనం, కావ్యజ్ఞుల శిక్షతోడి అభ్యాసం—అనే రెండు గుణాలు కవితారచనకు ఆవశ్యకమన్నారు పెద్దలు.[3] త్యాగయ్యకు

---

1. చూ. కీర్తనలు 'సారివెడలిన యీ కావేరి'; 'యుక్తముగాదు.'
2. చూ. కీర్తనలు: 'యోచనా కమలలోచన'; 'మానస సంచర రే'
3. 'శక్తిర్నిపుణతా లోక శాస్త్రకావ్యాద్యవేక్షణాత్,
   కావ్యజ్ఞ శిక్షయాభ్యాస ఇతి హేతు స్తదుద్భవే'
   (కావ్యప్రకాశం, ఉల్లాసం ౧)

శక్తీ, అభ్యాసమూ సమృద్ధిగా ఉన్నవి. కాని తక్కినవి సంపాదించే విరామమూ, అక్కరా ఎక్కువగా ఆయనకుండినట్లు కానరాదు. కాబట్టే 'నీ తండ్రిసొమ్ము వెరవక పోనేరదు', 'ఈ హరామితన మేల', 'రంగడా విభీషణునకు పంగనామ మిడినరీతి'[1] ఇత్యాది. బాల భావాలు ఆయనరచనలో పడి నిలిచినవి. చెప్పవలసిన భావాలు స్పష్టంగా, సరళంగా చెప్పగల ఓర్పో, శక్తియో లేక వాక్యమూ ఛందస్సూ ముగిస్తే చాలునని ముందుకుపోయిన రచన యెంతో ఉన్నది. కాబట్టి ఎన్నో కీర్తనలలో అర్థమిప్పటికీ అస్పష్టంగానే నిలబడింది. ఇదంతా ఆయన శిష్యప్రశిష్యులు తెలుగు తెలియక చేసిన అపరాధమని చెప్పేది ఒక సంప్రదాయం. కొంత నిజం కావచ్చును. కాని, త్యాగయ్యగారికికూడా ఇందులో భాగం ఎక్కువగానే ఉండిందని చెప్పకపోవడం సాధ్యంకాదు. ఆయనది తోచినవెంటనే కూర్చిపెట్టిన ఆశుకవిత; మన సంగీత రచన వంటిది. రాగం, తానం, పల్లవి, స్వరకల్పన ఇత్యాది కర్ణాటక సంగీత స్వతంత్రరచనలలో గాయకుడు వల్లించినదానిని వదలి తన-సభ్యుల-అదృష్టాన్ని నమ్మి 'నీవేగతిరా దేవుడా' అని సాహసించి కల్పనకు దూకుతాడు. ఆ తెగుదారి చొరవలో ప్రతిభావంతుడయి సుశిక్షితుడైన గాయకునినుండి అతడుగాని, మనంగాని కలలోనైనా ఊహించిఉండని అపూర్వాద్భుతరచనలు ఆవిర్భవించగలవు. ఆ ప్రయత్నంలో అపస్వరాలూ, అవలయలూ చొచ్చుకొన్నా మనం ఓర్చుకొందుము. ఓర్చుకోవలెనుగూడ. ఆ కళస్వరూప మది గనుక పట్టుకు సులభంగా దొరకని నాదకాలాలతో అర్థములేని భావాలను రచించే విద్య అది. కాని సంకేతబద్ధమైన వాగర్థాలతో చేయవలసిన కవితాకళ ఆ దారిలో నడపవలసిన అక్కరలేదు. స్ఫురించిన రచనను మళ్ళీ నిదానంగా నెమరువేసి ఏర్పులూ తీర్పులూ చేసే అవకాశమూ, చేయవలసిన ధర్మమూ ఇందులోఉంది. దానిని ఉపయోగించుకోకపోతే ఆకళ అఖండంగా సిద్ధించదు. కాబట్టే 'నిలకడ వలయుఁ గృతికి' అన్నారు విమర్శకులు. ఆశురచనలో

1. చూ. కీర్తనలు : 'కరుణాజలధీ' (కేదారగౌళ), 'ఎదుట నిలచితే', 'రామ దైవమా.'

కూడా అప్పు డప్పుడు అద్భుత రచనలు మించవచ్చును. కాని, కవికి ఆసాకు పనికిరాదు; రాకూడదు. త్యాగయ్యగారి కవిత ఈ ఆశుతరగతిది. ఆశ్చర్యము కలిగించే ముక్క లెన్నిఉన్నా అఖండత చాలనిది. కనుక తెలుగు సాహిత్యంలో ఇతర మహాకవుల రచనలు చవిచూచిన నాలుకకు త్యాగయ్య కవితలోని రసం చాలదు. ఈ మాట సాహసమైతే మన్నించండి.

ఇంక నిజంగా నావంటివారి పాలికి మిగిలింది ఆయన అనుగ్రహించిన గానం. అది మహాప్రసాదం. దాని వైశాల్యం, గాంభీర్యం, విలాసం, వైదగ్ధ్యం, వైవిధ్యం—అనిర్వచనీయమైనవి. దాని కదే సాటి. నిజమాలోచిస్తే త్యాగయ్యగారు ఆజీవమానం అఖండంగా అంతరంగంలో సాధించింది రామభక్తి యోగం; బహిరంగంలో అట్లే సాధించింది నాదయోగం. కవిత్వం ఈ రెంటికీ పొత్తుకలిపే కొండివంటిది. అది యీ రెండు మహాద్రవ్యాల ఒత్తిడిలో సన్నగిల్లి మసకమసకయిపోయింది. వంశపరంపరతో వచ్చిన త్యాగయ్య గానాభిరుచికి శొంఠి వేంకటరమణయ్యగారి దోహదం లభించింది. ఆ మహావిద్వాంసుడు—వాగ్గేయకారకుడు—తంజావూరు సంస్థానం దర్బారులో ఉగాదిపండుగనాడు మొదటి పాటకచ్చేరీ చేసే అధికారాన్ని సంపాదించుకొన్నవాడు. ఇంతేకాదు. 'మహారాజువారికొలువు మంటపములో రాజువారి ప్రక్కన అర్ధసింహాసనారూఢు'డట.[1] అంతటి మహావిద్వాంసునిశిక్షకూడా ఈ శిష్యమహత్తరునికి చాలలేదు. మళ్ళీ రామకృష్ణానందస్వామే వచ్చి నారద మంత్రోపదేశంచేసి ఉపాసన చేయించినాడు. దానిఫలంగా 'నాదసరసీరుహాభృంగుడు' నారదుడు ప్రత్యక్షమై అనుగ్రహించినాడు. కనుక త్యాగయ్య సంగీతం మనుష్యుల మట్టాన్ని దాటి దివ్యత కెక్కింది. కొన్నాళ్ళకు తరువాత శొంఠి వేంకటరమణయ్యగారే శిష్యుణ్ణి పిలిపించి తనయింట్లో పాటకచ్చేరీ చేయించి, ఆనందం పట్టజాలక, తనకు మహారాజావారు బహుమానంగా ఇచ్చిన తోడా, మకరకంటి మొదలైన సొమ్ములతో ఆయనను అలంకరించి చూచి

1. వెంకటరమణ భాగవతుల గురుచరిత్ర.

కన్నీలు చల్లజేసుకొన్నాడట [1] 'శిష్యా దిచ్ఛే త్పరాజయం' అన్న పరమాచార్యన్యాయాన్ని సంతోషంగా ఆచరించి చూపిన ఆగురువు ఆ శిష్యునకే అన్నివిధాలా తగిన మహనీయుడు.

కనుకనే త్యాగయ్య నాదరచన భాషారచనను చాలా దూరం మీరిపోయింది. ఆయన నాదజీవానికి భాష శరీరంగానూ, ఎన్నోచోట్ల వట్టివేషంగానూ పరిణమించి ఒదిగి నిలిచింది. ఇంతే కాదు. పరదేవతగా శ్రీరామమూర్తిని ఉపాసించే సాధనంగా త్యాగయ్య ఉపయోగించుకొన్న యీ నాదకళ తుదకు శ్రీరాముడే ఐపోయింది. అథవా రాముడే నాదకళారూపముగా మారిపోయినాడు. అంటే రామమూర్తియందు దాకోపించి ధ్యానించిన అఖండత, అమేయత, అనిర్వచనీయత — ఈనాద ప్రపంచమందే త్యాగయ్యకు అనుభవానికి వచ్చింది. ఇంకొకవిధంగా ఈమాట చెప్పితే పాట భక్తియెల్లలనుగూడా దాటిందన్నమాట. ఆయన రచించిన అమోఘమైన కృతులలో ఒకటైన ఈ కృతి ఈ విషయానికి సాక్షి :

> 'నీదయచే రామ — నిత్యానందుడైతి,
> నాదబ్రహ్మానంద రసాకృతిగల — నీదయచే.
> వరమృదుభాష — సుస్వరమయభాష
> వరత్యాగరాజ వాక్చేలావృత'

కాబట్టే, 'నాదోపాసనచే శంకర నారాయణ విధులు వెలసిరి ఓమనసా' అని చాటేదాకా అయనధైర్యం పాకింది.

ఈ అనుభవమే ముఖ్యంగా ఆయన పాటలలో ఎక్కువగా ఉన్మీలితమైంది. సంకేతాలతో బ్రతికేది భాష. కాబట్టి దాని వ్యాప్తి మితమైనది; భాషనుబట్టిమాత్రమే చూస్తే 'ఆరగింపవే పాలు' అన్నపాట రామునికే పూజచేస్తూ పాలే నైవేద్యమిచ్చే సమయంలోమాత్రం సార్థకమౌతుంది. అప్పుడుగూడా ఒకమాటు ఆమాట చెప్పితే చాలును. కాని దాన్ని నాల్గుప్రక్కలా పట్టుకొని

1. వెంకటరమణ భాగవతుల గురుచరిత్ర.

ఆడించే పాటమెట్టుకు త్యాగయ్యగారు ఐదారుసంగతులు చేర్చినాడు. ఎందుకు ? ఈ రాముడు, పాలు, ఆరగింపు మొదలైన ఖండభావాల కంటే వాటికి ప్రేరకమైన ఉల్లాసం, అలౌకికత, తృప్తి మొదలైన అనుభవాలలో తన్మయత్వాన్ని పొందడానికి, అఖండమార్గంలో నడవడానికి, ఆ నాదరచనలు సోపానాలు కాగలవు. సంగతులైదారు అనేది మచ్చుకేకాని శక్తిగలవారు ఐదునూర్లూ, ఐదువేలూ కల్పించుకోవచ్చును ; కల్పించుకోవలెను. కీర్తనలకు సంగతులువేసి పాడే పద్ధతికి త్యాగయ్యే ప్రథమాచార్యుడంటారు. అదే నిజమైతే ఆయన కింతకంటే వేరేఉద్దేశం కానరాదు. ఆయన తన కీర్తనలను భాషాభావాలుమాత్రమే ధ్యానిస్తూ, చల్లగా, ముద్దుగా, స్పష్టంగా ముత్తైదువులు పెండ్లిపాటలవలె, ఒకమాటు పఠించి వదిలేవాడనీ, ఈ సంగతులు, నెరవళ్ళు, స్వరకల్పనలూ అన్నీ తరువాతి 'విద్వాంసుల' విపరీత కల్పనలని కొందరు ఊహించేట్టున్నది. కాని, అది న్యాయం కాదు. త్యాగయ్య గురువుగారింట్లో కచ్చేరి చేసినప్పుడు 'దొరకునా ఇటువంటిసేవా' అనే కీర్తన పాడి, దానిమూడవచరణంలోని 'కామిత ఫలదాయకియాసీత' అనేచోట 'పల్లవి సాహిత్య స్వరములు' పాడి చూపినప్పుడే గురువుగారు 'దొరకునా ఇటువంటి శిష్యుడు ?' అని మెచ్చుకొని తన బహుమానభూషణాలు ఇచ్చి గౌరవించినాడని వేంకటరమణభాగవతుల చరిత్రలో గలదు. ఇదిగాక ఎన్నో కీర్తనల సంగతులు అన్ని శిష్యపరంపరలలోనూ ఒకేవిధంగా నేటికీ పాడే వాడుకలో ఉన్నవి. ఇంకా 'నాద సుధారసంబిలను నరాకృతాయెరా' అనే కీర్తనలో సంగతులు ఆ నాదసుధారసమూర్తి రాముడు ఆడే మాటలైనవని త్యాగయ్యే ధ్యానించినాడు.

కాబట్టే ఆయన రచనలు భాష, మతం, జాతి మొదలైన ఎల్లలన్నీదాటి కర్ణాటక సంగీత రసికులందరికీ ఈ నూటయేబదేండ్లకు పైబడి పరమానందదాయకమైన ఆస్తిగా పరిణమించినవి. ఆయన తెలుగువాడనీ, రామభక్తుడనీ, బ్రాహ్మణుడనీ, ములకనాటి స్మార్తుడనీ ఎక్కువ అభిమానమో, అసహ్యమో ఆయన పాటల విషయంలో ఆధునికులు కొందరు చూపడం కేవలం బాలిశమని—ఆత్మాపరాధమని—చెప్పక తీరదు. అవి అలౌకికంగా అనుభవించవలసినవి.

కనుక రామభక్తి ఉన్నా లేకపోయినా, తెలుగు సంస్కృతాలు రుచించినా రుచింపకపోయినా, అయ్యగారి కీర్తనలు దొరకినన్ని సంగ్రహించడమూ, వాటి వర్ణమట్టులను స్వరూపనాశం చేయక భద్రపరచి శిష్యపరంపరలో వ్యాప్తికి తేవడమూ, గాన గాంభీర్యాన్ని ఆ అంతస్తులో తా మనుభవించి ఇతరు లనుభవించేట్టు చేయడమూ — ఇవి ఇప్పటి కర్ణాటక నాదకళారసికుల ధర్మమని నా ప్రార్థన. ఇది మతధర్మము, కులధర్మము, జాతి ధర్మము కాని కాదు. మఱి మానవధర్మం. వివిధభేదాలతో అడ్డగోడలతో ఉద్రేకాలు పెరిగి అనాహుతాలపాలై పోతూవుండే మన దేశంలో త్యాగయ్యగారి యీ గానకళను పరస్పరస్నేహ సౌహార్దాలకు సాధనంగా ఉపయోగించి మనం ధన్యులం కావలసి ఉన్నాము. భక్తి లభిస్తే వ్యక్తులు కృతకృత్యులౌతారు. కవిత్వం రసింపగలిగితే తెలుగు తెలిసినవా రానందిస్తారు. కాని త్యాగయ్యగారి నాదసుధ దొరకితే—హిందువులేకాదు, మనుష్యజాతే తరించిపోతుంది. ఆయనకళ నారాయణాస్త్రం. దానికి నమస్కారం తప్ప వేరే ఎదు రేమీ లేదు.

# తిక్కన్న తీర్చిన సీతమ్మ

## ౮

ఒక విధంగా చూస్తే తిక్కన్నగారి రచనలలో పాత్ర పోషణమనే కావ్యధర్మాన్ని విమర్శించడం న్యాయం కాదనిపించును. ఎందుకంటే: ఆయన రచించిన ఉత్తరరామాయణం, భారతం రెండూ ఎరువుసొత్తులే. అందలి పాత్రలన్నీ వాల్మీకి వ్యాసుల కైవాడపు తీర్పులు; ఒక్కటైనా తిక్కన్న క్రొత్తగా సృష్టిచేయలేదు. వాటి లోని కథాసందర్భాలూ అట్టివే. అందులో ఆదేశాగమలోపా లేమైనా ఉంటే తిక్కన్నకు దొరకిన గ్రంథపాఠమట్టిదనే మన మూహించుకోవలెను. రామాయణం ఉత్తరకాండలో, ముఖ్యంగా భారతంలో సర్వత్రా పాఠభేదాలకు మితీ మేరా లేదన్నది సుప్రసిద్ధ విషయం.

మరి ఆ రెండు గ్రంథాల్లో మొదటిది వేదసమ్మితము; వేదములతో సమానము. రెండవది పంచమవేదమే. అసలు వాటిలోని వ్యక్తులూ, విషయాలూ ఇప్పటి చారిత్రదృష్టికి సత్యము లైనా, కవికల్పితాలైనా, మన చేతికి వచ్చేసరికి పరమసత్యములై, ప్రామాణికములై, ఏ యితరవ్యక్తి విషయాలకూ లేని స్థిరస్వరూ పంతో మన జీవితంతో మేళగింపు చేసుకొని నిలబడినవి.

ఇందుమీద అవన్నీ అమానుషములూ, అతిమానుషములూ ఐన వస్తువులు; పుట్టుచావులు ; రూపురేఖలు, మంచిచెడ్డలు మొద లైన అన్నిటియందూ మనుష్యులకొలదిని చాలా మీరినవి. వట్టి వింతకథలూ, ఉద్రేచకఘట్టాలూ కాక, ధర్మాధర్మాల, న్యాయా న్యాయాల స్వరూపాలను మనుష్యుల మనస్సులలో చిక్కగా నాటే ఉద్దేశంతోనే సిద్ధమైనవి.

"ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని
యధ్యాత్మవిదులు వేదాంతమనియు,
నీతివిచక్షణుల్ నీతిశాస్త్రంబని
కవివృషభులు మహాకావ్యమనియు

లాక్షణికులు సర్వలక్ష్యసంగ్రహమని
యైతిహాసికు లితిహాసమనియు,
పరమపౌరాణికుల్ బహుపురాణసముచ్చ
యంబని మహిఁ గొనియాడుచుండ
వివిధవేదతత్త్వవేది వేదవ్యాసుఁ
డాదిముని పరాశరాత్మజుండు
విష్ణుసన్నిభుండు విశ్వజనీనమై
పరగుచుండఁ జేసె భారతంబు,'' (మహా భా. ౧-౩౨)

అని చెప్పిన నన్నపార్యుడు 'నిత్యసత్యవచను' డనడంలో సందేహమక్కరలేదు. 'ఏపట్టునఁ బూజ్యమూర్తియగు భారత సంహిత' అన్న తిక్కనమాట పైదాని సారసంగ్రహమే. వాల్మీకి రామాయణంకూడా, భారతమంత సార్వజనీనం కాకపోయినా, ప్రామాణ్య గౌరవాదులలో దానితో సమంగానే తూగునట్టిది. ముఖ్యంగా శ్రీరామానుజమతానుయాయులు దానిని శరణాగతి శాస్త్రంగా, ప్రత్యక్షరప్రమాణంగా పరిగ్రహించినారు. 'రామాదివ ద్వర్తితవ్యం న రావణాదివత్' (శ్రీరాముడు మొదలైనవారి వలె నడువవలెను; రావణాదులవలె కాదు) అనే ధర్మసూత్రాన్ని ప్రచారంచేసేదే ఆ గ్రంథాల పరమోద్దేశం. తరతరాలుగా మనం వాటి నట్లే యథాశక్తిగ ఉపయోగించుకొన్నాము. కనుక స్వతంత్ర మిందులో చెల్లదు.

మరి పాత్రపోషణ మనేది, స్వతంత్రమైన కల్పనకు సంబంధించిన శిల్పధర్మం. దానిని కొలిచిచూపే మానదండము మన అనుభవమే. ఈ పాత్రము ఇట్లు వర్తించుట యుక్తం, ఈ సందర్భమీరీతిగా పరిణమించడం న్యాయం, సహజం, మరొకరీతిగా కాదు— అని నిర్ణయించడానికి మనసాక్షాదనుభవమో, దానిచేత ఏర్పడిన భావనాశక్తియో సాధనం కావలెనుకాని వేరులేదు. కాని అవి రెండూ రామాయణ భారతాలవంటి గ్రంథాల విషయాలను కొలిచి తీర్పుచెప్పడానికి చాలా చిన్న తక్కెడలు.

ఐనా మనం మనుష్యులంగనుక, మనకై మనలో వచ్చి చేరిన వస్తువులను మనదృష్టితో చూడక, మనమితిలోపలనే కొలవక,

ఉండలేము. పండు నోటికి పెద్దదైతే అనుకూలంగా చిన్నచిన్న ముక్కలుగా తరుగుకొని తినవలెననేది బుభుక్షువుల కందరికీ సహజమైన అధికారం. ఇట్టి విషయాలలో మన దౌర్బల్యమే మన నడతను సమర్థిస్తుంది. పౌరాణికవిషయాలను స్వానుభవంలోనికి తెచ్చుకొని నెమరువేయడానికి ప్రయత్నించిన పెద్దలూ, చిన్నలూ, అందరూ అన్నికాలాల్లోనూ కొంచెంగానో గొప్పగానో ఈ పని చేసినవారే.

తిక్కన్న 'ఎత్తతినైనను ధీరోదాత్త నృపోత్తముడు రామధరణీపతి సద్వృత్తము సంభావ్యము' (నిర్వ. ౧-౧౧) అని నమ్మినవాడు. కాని భారతంమీద ఉన్నంతభక్తిప్రతిపత్తు లాయనకు రామాయణమం దుండలేదేమో అని సందేహించే అవకాశముంది. పూర్వరామకథను తెలుగులో ఆయన యేల రచింపక వదలెనో నికరంగా కారణం చెప్పలేము. ఉత్తరకథను రచింపబూనినవాడు తెలుగులో మూలగ్రంథం తూ-చా తప్పకుండా దించితే అనుభవానికి చాలదనీ, అది రచన కానేరదనీ ఆయన తెలుసుకున్నాడు. ముఖ్యవిషయాలు మార్చే అధికారం మనకు లేదు. అవి యెంత అమానుషాలైనా, అసంభవాలైనా, అట్లే ఉండవలసినవే. మూలగ్రంథం గొప్పతనానికీ, వ్యాప్తికీ అవి ముఖ్యహేతువులు. కాని వాటి గొప్పతనానికి లోపంరాకుండా, వాటి సందులలోని చిన్న చిన్న వంకలను చక్కనొత్తడమూ, బంగలను మెత్తడమూ ఐనా చేయకపోతే మనకు రక్తి—అంటే అనుభవానికి నింపు—ఉండదు. మనకు కానవచ్చిన వంకలు, బంగలు నిజంగా వంకలేనా, బంగలేనా, అన్న ప్రశ్న తెగేది కాదు. ఆర్జవంగా మన మనస్సుకూ అనుభవానికీ అట్లు గోచరిస్తే చాలును; ఈమెట్టుదాటి తత్త్వాన్ని అందుకొనే భాగ్యం మనకులేదు. తిక్కన్నగారి పాత్రపోషణశిల్పం ఈ మితిలో ఈ ఉద్దేశంతో నడిచింది. దీనిలో ఆ మహామహుడు చూపిన నయగారపు పనితనం వాల్మీకి వ్యాసుల మూలగ్రంథాలతో పోల్చి చూచినప్పుడు ప్రతిపదమునందూ గోచరిస్తుంది. ఉత్తరరామాయణంలో సీతమ్మ విగ్రహానికి ఆయన చేసిన ప్రతికర్మ మనం గమనిస్తే ఈవిషయం స్పష్టమౌతుంది,

రామాయణాన్ని వాల్మీకిమహర్షియే 'సీతాయాశ్చరితం మహత్' అని వర్ణించినాడు. (రా. బా. ౪-౭) ఉత్తరరామాయణంలో సీతమ్మవిషయంగా తిక్కన్న చూపిన పక్షపాత గౌరవాలు గమనిస్తే, వాల్మీకి దీనికి 'సీతాయన' మని యేల పేరు పెట్టలేదని మనస్సులో నొచ్చుకొన్నాడేమో అనిపిస్తుంది. ఉత్తర రామ కథలో నిజమైన పట్టుగొమ్మ సీత. గ్రంథంలో ఇంచుమించు సగానికి మించి రావణాదుల పురాణకథాశ్రవణం ఆక్రమించింది. దానికి తరువాతనే సీతమ్మపాత్ర ప్రవేశం. సీతారాముల విహారలీలలు; వెంటనే గర్భధారణం; జనాపవాదశ్రుతి; దాని ఫలంగా సీత కోర్కె తీర్చే నెపంతో లక్ష్మణునిద్వారా ఆమెను గంగాతీరారణ్యంలో వదలుట; కుశలవుల జననం; రాముని అశ్వమేధయజనము; అక్కడ కుశలవుల రామాయణ గానము; సీతను పిలిపించి మహాసభలో తన చరిత్రనుగూర్చి శపథం చేయించడం; ఆయమ మాతృభూమి గర్భంలో లయించుట; రామునికోపము; శాంతి; పరమపద ప్రాప్తి— ఇవి ఇందలి సుప్రసిద్ధ కథావస్తువులు.

ఇందు రసానుభవదృష్టికి, ధర్మదృష్టికి ప్రధానమైనది సీతాపరిత్యాగ ఘట్టము. రామకథలో ఇంత హృదయద్రావకము, ఉద్వేజకము ఐన సన్నివేశ మింకొకటి లేదు. మరి లోకాపవాదానికి భయపడి నిర్దోషియైన ప్రియపత్నిని త్యాగం చేయడం ధర్మమా, అధర్మమా అనే ప్రశ్న తలంలేని లోతుగలది. మనుష్యజీవితంలోని పెక్కు మహాధర్మసంకటాలకు ఇదొకమచ్చు. ఇదమిత్థమని దీనిని నిర్ణయించే పూనిక వ్యర్థం. ఆ సంకట మేర్పడినప్పుడు సంస్కృతచిత్తుడైన మనిషి తన అంతరాత్మ ఋజుసాక్షికి లోబడి అప్పటి కనుకూలంగా కర్తవ్యం నిర్ణయించి చేయును; లేదా తనకంటె జ్ఞానవయో వివేక వృద్ధుల నడిగి వారి యుపదేశప్రకారం ఆచరించును. ఏమైనా అది తాత్కాలికమైన తీర్మానమే; సర్వకాలాన్వయికాదు; కానేరదు. ఏసంకటమూ లేక గట్టున కూర్చొని చూస్తూ విమర్శించే మనవంటివారు చేసే నిర్ణయం పుస్తకాలకో, ఉపన్యాస పీఠాలకోమాత్రమే పనికి వస్తుందంతే. ఏకపక్షదృష్టి ఇందులో తప్పదు. ఏకపతివ్రతం స్త్రీలకు పరమధర్మమని, పరపురుషస్పర్శమే

దోషమని, బుద్ధిపూర్వకమైనా, కాకపోయినా వ్యభిచారం ప్రాయశ్చిత్తమే లేని పరమపాపమని, అట్టిస్త్రీకి త్యాగమే శిక్షయని నమ్మిన రాష్ట్రంలో, ప్రజలను ధర్మం దాటకుండా పాలించే భారంగల ప్రభువు, ఇంచుమించు ఒక సంవత్సరకాలం—

> [1] 'స్వధర్మో రక్షసాం భీరు సర్వథైవ న సంశయః
> గమనం వా పరస్త్రీణాం హరణం సంప్రమథ్య వా'
> (రా. సుం. స. ౨౦-౫)

అని బహిరంగంగా ఘోషించేవాని ఇంటిలో చెర జిక్కియున్న భార్యను జూచినప్పుడు—

> [2] 'ప్రాప్తచారిత్ర సందేహా మమ ప్రతిముఖే స్థితా
> దీపో నేత్రాతురస్యేవ ప్రతికూలాసి మే దృఢమ్'
> (రా. యు. స. ౧౧౮-౧౭)

అని తీవ్రంగా భావించి పల్కడంలో అస్వాభావికతగాని, అధర్మంగాని కలదనుకోవటం అవిచారితరమణీయం. హిందువుల నమ్మకము ప్రకారంగా, ధర్మం మూడుపాళ్ళు నశించిన ద్వాపరాంతంలోనే—.

> [3] 'స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ జాయతే వర్ణసంకరః,
> సంకరో నరకాయైవ కులఘ్నానాం కులస్య చ'
> (భగవద్గీత ౧-౪౧)

అనే దృఢశ్రద్ధ చదువరులలో గలదు. అట్లుండగా ధర్మం మూడుపాదాలతో నడుస్తూఉన్న త్రేతాయుగంలోనివారిమాట

---

1. సీతా! పరస్త్రీలను పొందుటగాని, బలవంతంగా హరించుటగాని రాక్షసులకు సర్వథా స్వధర్మము. (సీతతో రావణుని వాక్యం)

2. నీ నడతలో సందేహమున్నది. నీవు నా యెదుట నిలబడితే, కండ్ల రోగం కలవాడు దీపంవలె, నేను చూడలేకున్నాను. (రాముని మాట సీతతో)

3. స్త్రీలు చెడితే వర్ణసంకరమేర్పడును. దానిచే కులము చెరిచిన వారికీ, కులానికీ అంతా నరకం రాక తప్పదు.

చెప్ప బనిలేదు. ఇంత తీవ్రంగా ఈ యభిప్రాయాలను, నమ్మకాలను నెలకొల్పుకొనవచ్చునా అన్నది ఇప్పుడు మనమే కాదు, అప్పుడు గూడా ఒకప్రక్క కొందరైనా తీవ్రంగానే వేసుకొన్న ప్రశ్న. కాని [1]'ధర్మా దర్థశ్చ కామశ్చ' అనే మాట సత్యమైతే, ఆ ధర్మ సూత్రాలు శిథిలంగా చేసికొనలేము, చేసి జీవింపలేము. వాటిని సంఘంలో వ్యాప్తికి తెచ్చే అధికారమూ, ఉద్యోగమూ కలవారు వ్యక్తులకు దానివల్ల కలిగే సుఖ దుఃఖాలను గమనింపరు; గమనింప లేరు. ఇట్లు ధర్మసూత్రాలను దృఢంగా బిగించినప్పుడు నడుమ చిక్కి నలిగిపోయే కోటానకోటి వ్యక్తులలో సీతమ్మకూడా ఒకతె. రాముని నడతనుగూర్చి ఇంతకంటె ఎవరూ చెప్పగలిగింది లేదు. 'రామో విగ్రహవాన్ ధర్మః' (రా. అర. 3౭-౧3) — రాముని స్వరూపమే ధర్మము.

కాని సీతాదేవి ఇంచుచేత పడినపాట్లు తలచుకొంటే ఎవరి కైనా కనుపుచుమ్మలుచుట్టి తీరుతుంది. మన అనుకంప అంతా ఆమె ప్రక్క మొగ్గుతుంది. 'నీ ధర్మమూ, రాజ్యమూ ఏ యేట్లో పోతే మాకేమి, మా సీతమ్మకు నిష్కారణంగా నీవు పెట్టిన ఈ కష్టం చూడవయ్యా' అనే చూపుతోనే రాముని నడతను విమ ర్శిస్తాము. కవి ముఖ్యంగా ప్రజాహృదయానికి ప్రతినిధి. తిక్కన కవిబ్రహ్మ ఉత్తరరామాయణంలో సీత నిట్లే భావించినాడు.

ఇందు సీతపాత్రప్రవేశమే వివిధ శృంగార విహార విలాస ములతో నడిచింది. మూలంలో పది పద్యములలో ముగిసిన యీ దంపతుల స్వచ్ఛందవిహారాలను తిక్కన్న అగవైె పెద్ద పద్యాలలో వింతవింతగా విరివిగా వర్ణించినాడు (నిర్వ ౧:౨౦-౧౦). ముందు ఆమె పడబోయే మహాయాతనను కవి భావనచేయగల్గుట కిది పాథేయంగా భావించినాడేమో! వాల్మీకి యీ సందర్భంలో సీతారాములకు మైరేయు మాంససేవ చేయించినాడు (రా. ఉ. ౪౨-౧౮). కాని తిక్కన దానిమాట చల్లగా జార్చినాడు. అసలు

1 ధర్మమువల్లనే అర్థకామాలు రెండూ అనుభవింప వీలుకలదు. (మహాభారతం)

సీతారాము లేమిచేసినా చేయకపోయినా తిక్కన్న బ్రాహ్మణ దృష్టిలో ఆ రెంటికీ చోటు లేదాయెనేమో! అప్పటి కింకా ఆయన సోమయాజియైనా కాలేదుగా!

రహస్యగోష్ఠిలో రాముడు లోకవార్తను తన్నడిగినప్పుడు భద్రుడు సీతమ్మమీది అపవాదాన్ని ఒకతాయంతో నోరు విడువలేదు. మూలంలో ఉన్న 'సుసమాహితః' (33-౧౨) అన్న ఒకమాట నాధారంచేసుకొని తిక్కన్న, యీమాట చెప్పవలసిన భద్రుని మనోవేదనను వివిధంగా పెంచినాడు. రాముడు చేసిన బలవంతానికి—

'......అతండు వెలువెల్లసగుచు డెందంబు గొందలంబందగం జెప్పను జెప్పకుండనేరక, అనుమానముతోడ నిక్కడక్కడం బడి......'

తుదకు విధిలేక 'ఎలుగు రాలుపడ' చెప్పినాడు (ఎ. ఉ. ౮: ౧౦౦-౧౦౩). దానిని విన్న రామునకు 'పరమార్తవత్' (రా. ఉ. ౪3-౨౧) ఉండెనని వాల్మీకి చెప్పినమాట కథకు చాలినా అనుభవానికి చాలదు. తిక్కన్న రాముడు మొదటిసారి 'సుఱ సుఱ డెందము సూడిన తెఱగున నొక్కింత స్రుక్కి' మరల 'మూర్ఛ వచ్చిన మనంబునకున్ ధృతి నూత నిచ్చి' వ్యవహరిస్తాడు.

(నిర్వ. ౮: ౧౦౬-౧౦౯)

తరువాత ఆతని యాజ్ఞతో తమ్ములు ముగ్గురూ వచ్చిచేరుతారు. ఈ తీవ్రోద్వేగ సన్నివేశంలో, ఈ అల్పవిషయాన్ని ౧౧ పద్యాలతో నిధానంగా వ్రాస్తాడు వాల్మీకి మహర్షి (స. ౪౪-౧-౧౧). సమలోష్టాశ్మకాంచనమైన ఆ మహామహుని శాంతిసిద్ధికి జోహారులు! కాని తిక్కన్న మనవంటి అల్పజీవులపై దయతో 'తమ్ముల నప్పుడ పిల్వబంచె'; 'ఆ భరతాదులు నగరి కేగుదెంచి' అని చిటుకలో ముగించినాడు (౮—౧౧౯).

తమ్ములకు వచ్చిన సీతాపవాదమును చెప్పుచు మూలంలో రాముడు :

[1]"అంతరాత్మా చ మే వేత్తి సీతాం శుద్ధాం యశస్వినీమ్"
(రా. ఉ. ౪౫-౧౦).

అన్న ఒకమాటకూడా సీతపై మనకు, రామునకు ఉండ వలసిన భక్తిశ్రద్ధాగౌరవములకు చాలదు. తెలుగులో రాముడు స్పష్టంగా—

"వేవురు నేల? నేను పృథివీసుత చిత్తము పెంపెఱుంగనే!
భూవలయంబు సంచలతబొందిన, వారిధి మేర దప్పినన్,
దేవనగంబు పాతగలి త్రెళ్ళిన, నందొక కీడుగల్గునే!
ఆ వనజాక్షి నిట్లు సెడనాడిన నక్కట! నోరు ప్రువ్వదే?"
(నిర్వ. ౮-౧౧౭)

అని ముక్తకంఠంగా అంటాడు! సరి. అన్నమాటకు మారాడే అధికారమూ, స్వభావమూ లేని లక్ష్మణుడు మరుదినం సుమంత్రునికి చెప్పి రథం సిద్ధంచేయిస్తాడు. వాల్మీకి గ్రంథం ప్రకారంగా సీతమ్మయింటికి అతడేపోయి 'అమ్మా, నీవేమో వరమడిగితి వట, అన్న యిచ్చినాడట. శీఘ్రంగా గంగాతీరంలో ఋష్యాశ్రమాలలో నిన్ను విడిచిరమ్మని నాకాజ్ఞ' అని చెప్పినాడు.
(ఉ. రా. ౪౬-౭).

లక్ష్మణస్వామి పెద్ద ఉద్రేకపు ముద్ద. పాదాలుతప్ప తక్కిన అంగాలలో దేనినీ చూచియెఱుగనంత మహాభక్తి వదినె మీాద అతనికి. అట్టివాడీ సందర్భంలో ఇట్లు శుష్కంగా, నిర్దాక్షిణ్యంగా, నిర్వికారంగా వదినెను పిలువగల్గెనా? ఆవ్యక్తి కంత ఆత్మ సంయమం స్వాభావికమా? ఇదొక ప్రశ్న.

ఇంకొక్కటి ప్రయాణవేళలో సాగనంపడానికైనా సీతమ్మ వద్దకు రాముడు రాబనిలేదా? అట్లు రాకపోవడం సీతమ్మకు వింతగా తోచదా? శాశ్వత పరిత్యాగం చేస్తూ, దగ్గర నిలిచి సాగనంపే మొగము రామునికి లేకపోవచ్చును. కాని సీతమ్మ కింకా ఆ

1. నా అంతరాత్మకు సీత పరిశుద్ధురాలని, కీర్తిమంతురాలని తెలియును.

విషయ మప్పటికి తెలియదు. కనుక ఆమె రాముడు కానరానందుకు ఆక్షేపించి తీరవలయును. లేదా ప్రయాణవేళలోనే ఆమెకీ పరిత్యాగ వార్త తెలియజేయవలెను. కాబట్టి లక్ష్మణుని మాట విన్న మాత్రంతో సీత 'ప్రహర్ష మతులం లేభే' (౪౬-౧౨) అన్న వాల్మీకి మాట సీతాస్వరూపానికి చాలదు. భవభూతి ఉత్తర రామ చరితంలో—రాముడు సీతను ఋష్యాశ్రమాలకు తప్పక పంపుతానని, లక్ష్మణునితో రథము సిద్ధంచేయుమంటే, సీత 'ఆర్యపుత్ర, మీరూ అక్కడికి రావలెను.' అని ఆజ్ఞచేస్తుంది. 'ఇదిగూడా చెప్పవలెనా?' అంటాడు రాముడు. అందుపై ఆమె నెమ్మదిగా నిద్రిస్తుంది. మేలుకొనేలోపల లోకాపవాదకథ విని రాముడు శోకించి ఆమెను విడిచిపోతాడు. ప్రయాణసమయంలో రాముడు లేనందుకాశ్చర్యపడి 'కానీ, అతనిమీద కోపం చూపుతాను—అతని మొగం చూచినప్పుడు నా తెలివి నాలోఉంటే!' అంటుంది (ఉ. రా. చ. అం. ౧). ఆ కవి యింతకుమించి పోలేకపోయినాడు. ఇంతేకాదు. త్రోవలో సీతాలక్ష్మణుల సంవాద కథంతా తెర మరుగుకే వదలి తాను తప్పించుకొన్నాడు!

తిక్కన్న కిది చాలకపోయింది. వాల్మీకి కొక ప్రొక్కు ప్రొక్కి, సీతప్రయాణసమయంలో రామునినే ప్రధానంగా తెచ్చి నిలుపుతాడు. రాముడు—

> "అడలడచి నెమ్మనంబున
> వెడతెలివొడగూర్చి మాట వేర్పడకుండన్
> జడిముడిపడక నయంబున
> నెడమడువొక్కింత లేక యిట్లను సతితోన్."

> "పొలతుక గంగచేరువ తపోవనభూములు సూడ నీమదిన్
> మొలచిన కౌతుకంబు తుదిముట్టగ లక్ష్మణదేవు నిన్ను నం
> దులకు మనోముదం బెసగఁ దోకొనిపో నియమించితిన్ సము
> జ్జ్వలమణికాంతమైన రథసత్తమ మెక్కుదురమ్మ నావుడున్."

(౮-౧౩౭)

సీతమ్మ నిండుమనస్సుతో—

"అకట! నాదువేడ్క కుచితానుచితంబులు సూడకే విభుం
డాక్కతలంపువాడయి సముత్సుకతన్ నను దవ్వుపుచ్చగా
నిక్కమ యియ్యెకో లరయ నెయ్యము తియ్యముగాదె!..."
(౮-౧౩౩)

అనుకొని సరేనన్నది. కాని యీనాటకాన్ని లక్ష్మణుడు చూచి సహింపగలడా? మఱి సహింపకమాత్రం ఏమనగలడు? అన్నధైర్యానికీ, వదినె పిచ్చినమ్మికకూ ఆశ్చర్యమూ, దుఃఖమూ అతని నావరింప మొగంమీద తోచినవి. దానిని చూపి రాముడు సీతతో—

"దూరమునాక ఘోరవన దుర్గతలంబులఁ గేలి సల్పగాఁ
గోరెదు భామలన్ బ్రియలఁ గోరినయట్టుల పుచ్చు రాజులన్
ధారుణి నెందుఁ గానమని తా మును దీనికి నడ్డపెట్టనేఁ
బోరితమాడి యిట్లు నిను బుచ్చుట కల్గినవాఁడు సూచితే!"
(౮-౧౩౫)

అని పెద్ద అల్లికమొకటి అల్లి సీతను వలలోవేసి, తమ్ముని నోరు—తెరవనిదాన్నే—మూస్తాడు. 'ప్రియవాదీ చ భూతానాం సత్యవాదీ చ రాఘవః' (అయో. ౨-౩౨) అన్న రాముని కీర్తికి భంగం దీనితో వచ్చిందని దుఃఖంచేవారు దుఃఖంపనిలేండి. సీతమ్మ వ్యక్తికిమాత్రం దీనితో కొంత ప్రాణబలం వచ్చింది. పొమ్మంటే పోయి, రమ్మంటే వచ్చే రకంకాక, రాముడు అసత్యమైనా చెప్పి మనస్సు నెమ్మదిపరచవలసిన పాత్రంగా ఆమె యిందు తయారైంది. మఱి మునిపత్నులకని వాల్మీకి సీత స్వయంగా తీసికొన్న 'మణిమయ భూషణాంబరాదులు' తిక్కన్న రామునిచేతనే ఆమె కిప్పించినాడు. ఇట్లు ఆమెను—

"పాలతోడ విషంబిడు పగిది నగిచి
పుచ్చి రాఘవుఁ డుల్లంబు నొచ్చి మరలె" (౯-౩)

సీతను తోడ్కొనిపోయి లక్ష్మణుడు రథమును సుమంత్రునితోగూడ గట్టున నిలిపి గంగానది దాటి అద్దరిలో, ఆమెతో,

రాముని పరాధీనత, పరిత్యాగావశ్యకత స్పష్టమగునట్లు, పరమ దుఃఖముతో విషయమంతా మనవిచేస్తాడు. "వాల్మీకియాశ్రమ మిందే యున్నది. అందు సుఖంగా వసించు" మన్నాడు. అంటూ కడపటిదిగా ఒక అధికప్రసంగపుమాట జారవిడిచినాడు —.

> 1 "ఉపవాసపరైకాగ్రా వస త్వం జనకాత్మజే
> పతివ్రతాత్వ మాస్థాయ రామం కృత్వా సదా హృది"
> (రా. ఉ. ౪౭-౧౮)

లక్ష్మణుని నోట సీతమ్మకీ యుపదేశపు మాట రానిచ్చుట యిద్దరు వ్యక్తుల యోగ్యతకూ చాలనిది. గనుకనే తిక్కన్న దానిని వాల్మీకికే వదలినాడు.

తనకు కల్గిన అచింతితమైన దౌర్భాగ్యానికి సీత మూర్ఛపోవడమూ, ఏడ్వడమూ సహజమేకదా. కాని యీస్థితిలో మన కంతమాత్రం చాలదు. సీత పాతివ్రత్యధర్మంలో మనకు తృప్తీ, శ్రద్ధా ఉన్నవి. ఆస్థితిలో ఆమె భర్తను తిట్టి, తిరస్కరించి, ఇంకొక పెండ్లో పేరంటమో చేసుకొనిఉంటే 'బలే' అని సంతోషించే కొందరు, ఈనాడే కాదు, ఆనాడుగూడా ఉండిఉంటారు. అది వేరుమాట. కాని తిక్కన్న ఆజాతికి చేరడు. ఆయనకు, మనలో ననేకులవలె, వచ్చిన కష్టమేమంటే : సీతమాత్రం ధర్మబద్ధురాలు కాదా? భర్తకు సహధర్మిణిగాగదా ఆవ్యక్తి తయారైనది? అట్టిచో ధర్మాచరణవిషయంలో భర్త ఆమెతో ఆలోచింపక యిట్లు వచించుట యేల?— అనేది. రాముని నడతలోని గొప్పమచ్చ అది; కనుకనే తిక్కన్నసీత యేమన్నది?—

> 'తన మది నొక్క యుమ్మలిక దక్కిన మంచిది; దానిఁ బాపఁగా
> నని తలపోసి చేయుపని కక్కట యేనును లోనుగానె? నా
> కు నెఱుఁగఁ జెప్పి పొమ్మనుటకుం దగనే! మొఁగమోట లేక మ
> న్నన యెడవైన రాజుల మనంబులు ద్రిప్పఁగ బల్మి గల్గునే!'
> (౯—౨౭)

1. ఏకాగ్రచిత్తంతో ఉపవాసాలుచేస్తూ, పతివ్రతాధర్మాన్ని అవలంభించి రాముని నెప్పుడూ ధ్యానిస్తూ ఉండవమ్మా.

ఈ ప్రశ్న తిక్కన మాత్రమే ప్రతిభాధైర్యంతో సీతమ్మ నోట వేయించింది. తెలుగులో పిన్నవీరన్నకుగానీ, పాపరాజుకు గానీ, సంస్కృతంలో కాళిదాసుకుగానీ యీ చొరవ లేకపోయింది. ఈ ఒక్కమాటతో సీతమ్మ కుండవలసిన స్వాభిమాన గౌరవాలు తళుక్కున మెరసి ఆమెను మీదికెత్తినవి.

లక్ష్మణుఁడు విడిచివెళ్ళినతరువాత ఆమె అఖండంగా ఏడుస్తూ ఉంటే వాల్మీకి వచ్చి ఆదుకుంటాడు. ఇందుగూడా వాల్మీకి వాల్మీకి కిన్నీ, తిక్కన్న వాల్మీకికిన్నీ భేదమున్నది. మూల వాల్మీకి సీతను మధురంగా పల్కరించినాడు. తిక్కన్న చేతికి వచ్చేసరికి ఆతడు మనఃక్షోభంబు సంధిల్ల, 'గద్గదికానిరుద్ధవచనుండై' పోయినాడు (౯-౮౧). ఇంతేకాదు; వాల్మీకి —

1 'సర్వం చ విదితం మహ్యం త్రైలోక్యే యద్ధి వర్తతే
అపాపాం వేద్మి సీతే త్వాం తపోలబ్ధేన చక్షుషా'
(౪౯-౧౪)

అని తాను మొదలు చెప్పిన మాటనే చక్కదిద్దుకొని తెలుగులో—

"లోకముల నెద్దియేనియు నాకు నెఱుఁగ
రాని యట్టిది లేదు, నిర్మలతనొప్పు
నీదుచరితంబు తెల్లంబుగాదె? రాము
నేరమియ చూవె యింతయు నిక్కమరయ"
(౯-౮౪)

అన్నాడు. వాల్మీకివంటి రసతపస్వికి, ప్రజాపాలనదృష్టితో రాముని ధర్మపరాధీనతను మెచ్చుకొన్నా, సీతను చూచిన కంటితో చూచినప్పుడు ఆతనినడత అవిచారరమణీయమని తోపకపోదు. ధర్మమును చూచేవారికి ఈ రెండు చూపులూ లేకపోతే, ధర్మ సామాన్యానికి మూలమైన లోకకల్యాణాన్నే క్రమంగా వారు మరచి

1. మూఁడు లోకాలలోని విషయాలన్నీ నే నెరుగుదును. నీయందు పాపము లేదని, సీతా! తపోదృష్టిచే నాకు తెలుసును.

పోయే అపాయం కలదు. ఈ రెండు ధర్మకోణాలకున్ను సామరస్యం సాధించడమే తపస్సుకు ఆధిభౌతికమైన పరమఫలం. వాల్మీకికవికి శిష్యుడైన కాళిదాసుకుగూడా గురువుగారియందీ లోపం కనిపించింది. ఈ సందర్భంలో అతడు గురువునోటనే సీతమ్మకు యీ క్రింది మాట చెప్పించినాడు :

> [2] "ఉద్ఘాతలోకత్రయకంటకేఽపి సత్యప్రతిజ్ఞేఽప్యవికత్థనేఽపి
> త్వాం ప్రత్యకస్మాత్కలుషప్రవృత్తా వస్త్యేవ మన్యు
> ర్భరతాగ్రజే మే" (రఘు. ౧౪-౭౩)

తిక్కన్న కింతమాత్రం చాలలేదు. ఆమెను పిలుచుకొని పోయి తపస్వినుల కప్పగించునప్పుడుగూడా, యీ మె—

> "జనకునికూఁతు రార్య గుణశాలిని రాముని దేవి సీత యీ
> తని కొఱగామి నియ్యెడకుఁ దాపసవృత్తిఁ జరింపవచ్చె..."
> (౯-౪౫)

అని కచ్చితంగా చెప్పి అప్పగించినాడు. కాని వాల్మీకికి గలిగిన యీకోపం ఇంతవరకూ పరోక్షంగానే వెల్లడియైనది. రాముని కీవిషయం తెలియవద్దా? కనుక, కుశలవుల రామాయణ గానం విన్నతరువాత వీరెవరని రాముడు ప్రశ్నింపగా, ఇది సమయమనుకొని తెలుగువాల్మీకి, కసిదీర, గంభీరంగానే ఇట్లన్నాడు :

> "వినయముఁ బెంపు నేర్పును వివేకమునుం గల నీవు మేదినీ
> తనయఁ దొరంగు టెట్టు లుచితంబుగఁ జూచితి విట్లు వోలునే!
> యనలవిశుద్ధయైన సతి నక్కట 'యెక్కడకేనిఁ బొమ్ము నీ'
> వని వెడలంగఁద్రోచిన దయాగుణకీర్తికి హానిపుట్టదే?

2. రాముడు త్రిలోకకంటకులగు రాక్షసులను నిర్మూలించినాడు; సత్యప్రతిజ్ఞుడు; ఆత్మశ్లాఘ లేనివాడు; కాని, సీతా, నిష్కారణంగా నీ విషయమున వాని మనస్సు కలుషితమయినది. కాన వానిమీద నాకు కోపముండనే యున్నది.

" నాఁ డగ్ని లోనఁ ద్రోచిన
వాఁడ వకట! యంతఁబోక వల్లభ నిమ్మో
నేఁ డడవిఁ ద్రోచి తెద గడు
వాఁడిగదే నీకు రాఘవకులప్రవరా!

" అంతనుండియు సీతోడ నలిగియున్న
వార మది యట్టులుండె...... "

(౧౦-౧౨౮, ౧౨౯, ౧౩౦)

నాటికి నేటికి ' అది యట్లే ' యున్నది. రాగమూ ధర్మమూ రెండూ అన్యోన్య బీజభూతములు. సమరసంగా పెరుగవలసినవి. కాని ఎన్నోమార్లు అవి పరస్పర విరుద్ధంగా వర్తించడం సృష్టిలోని మాయలలో మొదటిది. ఇది ఉన్నన్నినాళ్లూ సీతారాములనాటకం జరుగుతూనే ఉంటుంది. దీనిని ముఖ్యంగా రామునిదృష్టితో చూచి యనుభవించినవాడు భవభూతి; అట్లే సీతాదేవిదృష్టితో చూచి వేదనపడినవాడు తిక్కనామాత్యుడు; వాల్మీకిమహర్షిది ప్రధానంగా ధర్మదృష్టియని చెప్పబనిలేదు.